# వీక్షణం

Veekshanam Fortnightly

ఆర్థిక, సామాజిక పక్ష పత్రిక

సెప్టెంబరు 2004 | అయిదు రూపాయలు


భూ సంస్కరణల ప్రత్యేక సంచిక

# పేదలకు భూమిని పంచాలి

శంకరన్

సుందరయ్య

పరమేశ్వర్

నాగేశ్వరరావు

వ్యవసాయ కూలి సంఘం సర్వే

వర్క్‌షాప్ సిఫార్సులు


'వీక్షణం' పక్ష పత్రిక

8-3-898/22, నాగార్జున నగర్, హైదరాబాద్-500 073

# భూసంస్కరణలంటే భూమి పంపకం మాత్రమే కాదు

ఎస్.ఆర్.శంకరన్

భూ సంస్కరణలంటే కేవలం సీలింగుపైనున్న భూములను స్వాధీనం చేసుకోవటం, భూమిలేని వారికి, పేదలకు పంచి పెట్టడం మాత్రమే కాదు. భూమిని బదలాయించడమంటే అధికారాన్ని బదలాయించడమే. భూసంస్కరణలు అధికారాన్ని, ఆస్తిని, ఒక గ్రూపునుంచి మరో గ్రూపుకు, STATUS ను బదలాయిస్తాయి. భూమిని కలిగి వుండడం అంటే, అతను తలెత్తుకు తిరగవచ్చు; ఒకస్థాయిని ఇస్తుంది; తన శక్తిలో విశ్వాసం ఏర్పడుతుంది; సమభావన చోటుచేసుకొంటుంది. పేదరికం, దోపిడీ, న్యూనతాభావం, పరాధీనత, అసమానత-వీటన్నిటికీ భూమే కారణం. గ్రామీణ పేదలకు భూపంపకం చేస్తే వారిని దోపిడి నుంచి విముక్తి చేస్తుంది; లేబర్, క్రెడిట్ మార్కెట్లను బలపరుస్తుంది. భూమి వుంటే ఓ ఆదరువు ఏర్పడుతుంది, సమాజంలో ఒక స్థానాన్ని ఇస్తుంది. గ్రామీణ పేదలకు గ్రామీణ సామాజికార్థిక జీవనంలో ఒక స్థానం లభిస్తుంది. భూమికోసం గ్రామీణ పేదల తపన తెలిసిందే. ఒక వ్యాఖ్యాత అన్నట్లు-

> "సమానతత్వం కోసం, భూమికోసం తపన కొత్త విషయమేమీ కాదు.తనచుట్టూ వున్న భౌతిక పరిస్థితులతో తలపడుతూండగా ఏర్పడిన పరిణామాలు తనను ఎలా భూమి నుంచి, సమానత్వం నుంచి దూరం చేసాయో తెలుసుకొన్న పేదలు భూమిగురించి, సమానత్వం గురించి ఆలోచింప చేశాయి. వారి ఆలోచన ప్రకారం భూమి కలిగి వుండటం సమాజంలో ఒక స్థానాన్ని కల్పిస్తుంది, సమానత్వం అంటే భూమి కలిగివుండటంలో సమానత్వం"

భూసంస్కరణ రాజ్యాంగంలో పొందుపరచిన ప్రజలందరి సమానత్వంకోసం, చేసే పోరాటంలో అంతర్భాగం. ఇది సాధించేవరకూ రాష్ట్రంలో గాని, దేశంలోగాని భూసంస్కరణల ఎజెండా సంపూర్తి కానేరదు

# భూ పోరాటంలో వాస్తవాలు, వక్రీకరణలు

పరమేశ్వర్

యూరప్ సాహిత్యంలో ఫీనెక్స్ అనే అసాధారణ శక్తి గల ఒక పక్షి కనిపిస్తుంది ఆ పక్షిని కాల్చిబూడిద చేసినప్పటికీ ఆ బూడిదలో నుండి మళ్ళీ అది తిరిగి మరింత శక్తివంతంగా ప్రాణంతో లేస్తుంది. ఈ రోజు కొనసాగుతున్న భూపోరాటాలను అణచివేశాం, అణగిపోయాయి లేదా అణగిపోతాయి అనే వాదనలకు ఫీనెక్స్ పక్షిని ఉదాహరణ చెప్పదలచాను. నేడు తెలంగాణా అంతటా కొనసాగుతున్న భూపోరాటాలను పైపైన, పాక్షిక దృష్టితో చూచి వ్యాఖ్యానించేవారికి సైతం అదే ఉదాహరణ సరిపోతుంది. నేడు కొనసాగుతున్న భూపోరాటాలకు పోరాట చైతన్యం లేదని, ఎవరికైతే భూమి అవసరమో వారి పాత్ర లేదని, ప్రజలు భూస్వాముల పట్టా భూముల ఆక్రమణ స్థాయికి ఎదగలేదని, భూములు పంచితే తీసుకునే చైతన్యం మాత్రమే ప్రజల్లో ఉందని లేదా భయపెడితే భూములు వదులుకుంటారని, తుపాకులతో బెదిరించి మాత్రమే భూములు ఆక్రమిస్తున్నారనే వాదనలు భూపోరాటాలను వ్యతిరేకిస్తున్న వారు ముందుకు తెస్తున్నవి.

తాము బిగించిన చట్రంలోనే సంఘటనలు జరగాలని అలాగైతేనే వాటికి విశ్వసనీయత ఉన్నట్టుగా భావించేవారికి, వర్గ పోరాట క్రమంలో ఎదురయ్యే సజీవ సంఘటనలు చేదు గుళికలుగా మింగుడు పడవు. అలాంటి వారు నడుస్తున్న చిత్రంలోని సజీవ తత్వాన్ని ఎన్నటికి సొంతం చేసుకోరు. సమాజంలో జరుగుతున్న వర్గపోరాటం అప్పటి పొందికకు, స్థాయికి అనుకూలంగానే వివిధ రకాలైన ఘర్షణలను మన ముందు నిలుపుతుంది. వాటిని సక్రమంగా అర్థం చేసుకొని ఆ ఘటనలోని అభివృద్ధి క్రమాన్ని వేగిరపరచడమనేది నిజంగా సమాజ అభివృద్ధికి అంకితమైన వారి ఆచరణ వుండాలి. ఎన్నో ఏళ్ళుగా భూమి లాంటి ఉత్పత్తి సాధనం కొంత మంది చేతిలో ఉండి, భూమి కేంద్రంగా భూస్వామ్య వర్గాలకు, రైతాంగానికి మధ్య వర్గ పోరాటం సాగుతుంటే వివిధ రకాల వైరుధ్యాలు మన ముందుకు రాక తప్పవు. చారిత్రక క్రమంలో భూమి చేతులు మారుతూ 'భూమి' సమస్యలో చాలా సంక్లిష్టత చోటు చేసుకున్నది. ఈ సంక్లిష్టతలో పేదవారి మధ్య తగాదాలు రెచ్చగొట్టి పాలక వర్గాలు, భూస్వామ్య వర్గాలు తమ అధికార పీఠాన్ని కాపాడుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి.

వర్గ పోరాటాలు తీవ్రమవుతున్న కొద్ది పిల్లలకు తాయిలం పెట్టిన విధంగా భూసంస్కరణలు, భూదానోద్యమాలు, ప్రభుత్వ భూముల పంపిణీ, భూమి సర్టిఫికేట్‌లు తదితర సంస్కరణలు పాలకవర్గాలు ముందుకు తెస్తున్నాయి. గిరిజన-దళిత తదితర పేద ప్రజానీకంలో చైతన్యం పెరుగుతూ భూమి కోసం జీవన్మరణ పోరాటాలు కొనసాగిస్తుంటే ప్రజానీకాన్ని పక్కదారి పట్టించడానికి వీటిని ఎత్తుగడగానే పాలకవర్గాలు ప్రచారం కావిస్తున్నాయి.

**ఫ్యూడల్ ప్రభువుల పలాయనం**

తెలంగాణాలో 1978లో ప్రారంభమైన జగిత్యాల పోరాటమే వ్యవసాయ విప్లవంలో మలుపు. భూమి మీద హక్కు కలిగి, ఆ హక్కుతో వచ్చిన ఫ్యూడల్ అధికారానికి వ్యతిరేకంగా జగిత్యాల రైతాంగం తిరగబడింది. ఫ్యూడల్ ప్రభువులు ఊళ్ళు విడిచి పారిపోయారు.

ఈ ఉద్యమం ఆరిపోయిందని మధ్య మధ్యలో ఆశించిన వారికి అనేకసార్లు ఆశాభంగం కలిగింది. ఈ ఉద్యమం రోజు రోజు రెక్క విప్పుతూ పురోగమిస్తూనే ఉంది. ప్రస్తుతం తెలంగాణాలో వందలాది మంది మిలిటెంట్లు, సంఘనాయకులు ఉద్యమంలో చొరవతో పాల్గొంటున్నారు. రైతు కూలీ సంఘాలు, గిరిజన రైతుకూలీ సంఘాలు, ఎంతో విలువైన అనుభవం సంపాదించి ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్నాయి. చైతన్యం ప్రాథమికస్థాయి నుండి మెట్టు మెట్టుగానే అభివృద్ధి అవుతుంది. అలాగే ప్రజలు ఒక పోరాటంలో అనుభవం సంపాదించిన తర్వాత మరో పోరాటానికి పెద్ద పెద్ద అంగలు వేస్తూనే పురోగమిస్తారు.

రైతు కూలీలు ఈ పుష్కర కాలంలో సాధించిన విజయాలతో ఉద్యమం పట్ల వారికి ఒక విధమైన నమ్మకం ఏర్పడింది. వీరికి నాయకత్వం వహించడానికి సిద్ధాంత బలం కలిగిన విప్లవోద్యమ నాయకత్వం కిందనే ఈ రోజు తెలంగాణాలో ప్రజలు బ్రహ్మాండమైన పోరాటాలు నిర్వహిస్తున్నారు. 1990 జనవరికి ముందు విప్లవోద్యమం వెనుక ప్రజలు లక్షలాదిగా ఉన్నారంటే చాలా మంది నమ్మలేదు. జనవరి తర్వాత లక్షలాది మంది సభలకు హాజరైతే ఎవరికి తోచిన విధంగా వారు వ్యాఖ్యానాలు చేశారు.

వరంగల్ రైతు కూలీ మహాసభలో స్పష్టంగా ఇచ్చిన, 'దున్నేవారికే భూమి' ప్రాతిపదిక మీద వ్యవసాయిక విప్లవాన్ని పురోగమింప చేయాలనే పిలుపు మీదనే తెలంగాణా అంతటా భూస్వాముల చేతిలోని మిగులు భూముల ఆక్రమణలకు తలపడ్డారు. మే నుండి ఈ పోరాటం మహాద్భుతంగా సాగి భూస్వాముల వేలాది ఎకరాల పట్టా భూములను ఆక్రమించడం జరిగింది. ఉద్యమం మరో దశకు సాగింది. వేలాది నాగళ్ళు భూస్వాముల పట్టా భూముల్లో కొండ్రలు వేశాయి. లక్షలాది మంది స్త్రీలు, పురుషులు పిల్లలు ఈ భూఆక్రమణలో పాల్గొన్నారు. భూస్వామ్య వర్గాలకు ప్రభుత్వానికి ఈ పోరాటాలు పెద్ద సవాలుగా పరిణమించాయి.

**ప్రభుత్వ నిర్బంధాలు**

ప్రభుత్వం హడావిడిగా పంట చేలపై 144 సెక్షన్ ప్రకటించి అణచివేత చర్యలు ప్రారంభించింది. ప్రభుత్వం భూస్వాముల ప్రోద్బలంతో రైతాంగంపై పెద్ద ఎత్తున విరుచుకుపడింది. కొన్ని ప్రాంతాల్లో భూస్వాములు రైతాంగానికి లొంగిపోయిన చోట సైతం ప్రభుత్వమే చొరవ చేసి గ్రామాల మీద దాడులు నిర్వహించి బీభత్సాన్ని సృష్టించింది. వందలాది మంది పోలీసులు అత్యాధునిక ఆయుధాలతో గ్రామాల్లో రైతాంగాన్ని హింసించారు. అరెస్టులు, ఎన్‌కౌంటర్లు జరిపి ఉద్యమాన్ని అణచివేయాలని చూశారు. బూటకపు ఎన్‌కౌంటర్లలో 16 మంది మిలిటెంట్లను కాల్చి చంపారు. దాదాపు 3 వేల మందిని అక్రమ కేసుల్లో ఇరికించారు. ఇంత నిర్బంధకాండ కొనసాగించినప్పటికీ భూస్వామ్యవర్గాలకు ప్రభుత్వం ధైర్యం కలిగించ లేకపోయింది. రైతాంగం ఆక్రమించిన భూములను భూస్వాములు

తిరిగి ఆక్రమించుకోడానికి సిద్ధపడలేదు. ఇప్పటికీ కొందరు భూస్వాములు తమ భూములను ప్రజల పరం చేస్తున్నామని పేపరు ప్రకటనలు ఇచ్చి రైతాంగంతో రాజీకి వస్తున్నారు.

ప్రస్తుతానికి నిర్బంధం మూలంగా ఇటు రైతాంగం భూములు సాగుచేయకపోగా, అటు రైతాంగ సంఘటిత శక్తికి తలవంచుతూ భూస్వామ్యవర్గాలు భూములు సాగుచేయకుండా, ప్రస్తుత పరిస్థితి యుద్ధరంగంలో విశ్రాంతి లాగా ఉంది. పరిస్థితి ఎటు మారుతుందో అని భూస్వామ్య వర్గాలూ, నిర్బంధంలో కాస్త సడలింపు వచ్చాక సేద్యం చేద్దామని రైతాంగమూ ఇరుపక్షాలు ఎదురు చూస్తున్నారు. ఈ పరిస్థితిలో భూముల పరిస్థితి 3 రకాలుగా ఉంది. 1. మెజారిటీ భూములు బీడుగా ఉండడం 2. రైతాంగం కొన్ని భూముల్లో విత్తనాలు వేసి పంట తీసుకోవడం 3. భూములు సంఘం పేరనే ఉన్నప్పటికీ భూస్వాములు పంట తీసి సంఘంకు బటాయి ఇవ్వడం.

పైన తెలిపిన విషయం వాస్తవం కాగా, తుపాకీ బలంతోనే భూములు ఆక్రమిస్తున్నారని ప్రజల్లో పోరాట చైతన్యం లేదనే తదితర వాదనలన్నీ తప్పుడు వాదనలే! ఒక తల్లి బిడ్డను కనడానికి మంత్రసాని అవశ్యకత గుర్తించని వారి నుండి వచ్చే వాదనలు అవి. ప్రజలను పోరాటాల్లో తర్ఫీదు చేయుడానికి, ప్రజలను పోరాటాల్లో సమీకరించడానికి విప్లవోద్యమం నాయకత్వ పాత్ర వహించక తప్పదు. ప్రజల్లో పోరాట చైతన్యం లేదనే వాదం ఆచరణ క్రమంలో ఉన్నవారిని నిష్క్రియత్వానికి గురిచేసేది మాత్రమే. చరిత్రలో రైతాంగానికి సరియైన నాయకత్వం లభించినప్పుడు రైతాంగం బ్రహ్మాండమైన తిరుగుబాట్లు లేవనెత్తింది. స్థానిక రాజులను, విదేశస్తులను గజగజ లాడించింది. అయితే ఫ్యూడల్ భావజాలం ఉన్నంతవరకు వెనుక బడిన భావాలు ఉండడం సహజం. వాటిని పాలకవర్గాలు తమ స్వప్రయోజనాల కోసం వదులుకోవడం సహజం. అలా ఇందిరాగాంధీ లాంటి వారు ఎంతో చక్కగా ప్రజలను మోసం చేశారు. ఈ ఫ్యూడల్ భావజలాన్ని రూపు మాపకుండా వ్యవసాయ విప్లవంలోకి ప్రజలను సమీకరించలేం. వ్యవసాయ విప్లవం నిర్వహించేవారికి ఇది ప్రాథమిక కర్తవ్యం అవుతుంది. అలాగే దేశంలో తీవ్రతరమైన ఆర్థిక సంక్షోభం పెరుగుతున్నకొద్దీ పాలకవర్గాలు కూడా ప్రజలను పాత భావాలకు కట్టుబడి ఉంచలేవు. ప్రజలు తమ సమస్యలు పరిష్కరించుకోవడానికి వారి కాళ్ళ మీద వారు నిలబడి పోరాడక తప్పదు. విప్లవకారులు జగిత్యాల పోరాటకాలం నుండి ప్రజలను వివిధ పోరాటాల్లో తర్ఫీదు చేస్తూనే ఉన్నారు. ప్రజల చైతన్యం పెంచడానికి కృషి జరుగుతూనే ఉంది. వివిధ పోరాటాల్లో లక్షలాది మంది ప్రజలు పాల్గొంటున్నారు.

గత సంవత్సరం మే నుండి భూపోరాటాలు ఉవ్వెత్తున చెలరేగాయి. గిరిజనులు-దళితులు తదితర పేద ప్రజానీకం, భూ ఆక్రమణలకు సిద్ధమయ్యారు. తరతరాలుగా అణచివేతకు గురైనవారు కనుక వారి తిరుగుబాటు మనం కోరుకున్న విధంగానే ఉండదు. నిజానికి వారి భూములు గతంలో భూస్వాములు లాక్కున్నవే కాక ధనిక, మధ్య తరగతి రైతులలో వ్యక్తిగత తగాదాల్లో సైతం ఉన్నాయి. అవి అలా వ్యక్తిగత తగాదాల్లో ఉండడానికి అనేక కారణాలున్నాయి. ఇవి చరిత్రను పరిశోధిస్తే అర్థమవుతాయి. కాని వాస్తవంలో మాత్రం భూ సమస్యలు క్లిష్టతరంగానే ఉన్నాయి. అలాంటి వివాదాస్పద భూములను సైతం వ్యక్తిగతంగా ఆక్రమణలు చేశారు. కొన్ని సందర్భాల్లో సంఘనాయకులకు స్పష్టత లేకుండా కొంతమంది ధనిక రైతుల భూములు ఆక్రమణకు లోనయ్యాయి. ఏ ఉద్యమం లోనైనా అలాంటి చర్యలు జరగడం సహజమే. అలాంటి వాటిని క్రమంగా ఎడ్యుకేషన్ ద్వారా మాత్రమే సరిదిద్దడం జరుగుతోంది. అందుకు కొంత సమయం పట్టక తప్పదు. బాధ్యత లేనివారు విమర్శించడం తేలికనే గాని ఉద్యమంలో ఎంతో వైవిధ్యం వుంటుందనేది చూడరు. వివిధ రకాల భావాలను ఒకే తీరుగా మలచాలి. వివిధ స్థాయిల్లో ఉన్నవారు ఒకే భావనకు కట్టుబడేలా చేయడం అంత త్వరగా జరిగే విషయం కాదు. అందుకు నిరంతరం శ్రమ అవసరం. సమయం అవసరం. పోరాటంలో జరిగే తప్పుల నుండే వారు తిరిగి ఎడ్యుకేట్ అయి తప్పులు సరిదిద్దుకునే చైతన్యం సంతరించుకుంటారు.

ఈ పోరాటాలు మన ముందుకు అనేక ప్రశ్నలు తెచ్చాయి. రైతాంగం స్వానుభవం ద్వారానే ఎవరు తమ పీడక వర్గాల్లో తేల్చుకొని ఉంటారు. ఎవరి దగ్గర ఎంత భూమి ఉందో, అందులో ఏ కిత్తా (భాగం) ఎంత నాణ్యత గలదో కూడా వారు సరిగ్గా చెప్పకో గలుగుతారు. ఈ విషయంలో ప్రభుత్వ రికార్డులన్నీ దిగదుడుపే. రైతాంగం వెలిబుచ్చే అభిప్రాయాలకు విలువ ఇస్తూనే నాయకత్వం అక్కడ భూస్వామి ఎవరు, ధనిక రైతు ఎవరు, పేద రైతు ఎవరో తేల్చుకోవాలి. భూస్వామి అంటే భూమి పరిమాణం, భూమి నాణ్యత అందులో వచ్చే ఉత్పత్తి అతను శ్రమతో పాల్గొంటున్నాడా లేదా అనేది పరిగణనలోకి తీసుకొని ఆలోచించాలి. భూస్వాముల్లో 1. వందలు, వేల ఎకరాలు కలిగినవారు ఈ భూములతో పాటుగా వ్యాపారాలు, కాంట్రాక్టులు కలిగినవారు బడా భూస్వాములు, 2. ఫ్యూడల్ పద్ధతుల ద్వారా కూడబెట్టిన డబ్బును పెట్టుబడిగా పెట్టి కాంట్రాక్టులు చేపట్టి లక్షాధికారులుగా మారినవారు, భూమి పదుల సంఖ్యలోనే ఉండి గ్రామంలో మంచి స్థితిపరులుగా ఉన్నా వీరిని రెండవ తరగతి భూస్వాములుగా, 3. ఇక పదుల సంఖ్యలో కేవలం భూమి ఆధారం ఉన్న వారిని చిన్న భూస్వాములుగా వర్గీకరించి జనరల్ అవగాహనకు రావడం జరిగింది. అలాగే ధనిక రైతుల పట్ల, ఉద్యోగుల పట్ల చిన్ని చిన్న వ్యాపారాలు ఉన్నవారి పట్ల ఉద్యమానికి ఖచ్చితమైన అభిప్రాయముంది. వీరి భూములు ఎట్టి పరిస్థితిలోను ఆక్రమించ రాదు. పై సాధారణ అంచనా ఉద్యమానికి ఉన్నప్పటికి నిర్దిష్టంగా భూపోరాటాలను గైడ్ చేయడానికి గత ఏడాది ఒక స్పష్టమైన అవగాహనకు వచ్చింది.

ప్రస్తుతం కొనసాగుతున్న భూ ఆక్రమణ పోరాటాన్ని సరిగ్గా గైడ్ చేయడానికి గ్రామాల్లో వర్గ విశ్లేషణ చేయించి వివిధ వర్గాల మీద నిర్దిష్టమైన అంచనాకు రావాలి. ఈ భూపోరాటంలో బడా భూస్వాములను వేరు చేసి దెబ్బకొట్టే పద్ధతి అవలంబించాలి. మనం ఎవరికి వ్యతిరేకంగా పోరాడుతున్నామో ప్రచారం చేయాలి. భూపోరాటంలో లొంగి వచ్చే భూస్వామ్య వర్గాలను బట్టి తేడాలు చూపాలి. అక్కడి భూమి నాణ్యత ఉత్పత్తిని బట్టి సీలింగు తేడాలు విధించాలి. ప్రస్తుత స్థితిలో ధనిక రైతాంగం భూములను ఆక్రమించ రాదు. సీలింగులో ఏ పద్ధతి పెట్టినా భూస్వాములను ధనిక రైతాంగ స్థాయికి తగ్గించడం లక్ష్యంగా ఉండాలి. నిర్బంధం తీవ్రతరం అవుతున్న రిత్యా స్వాధీనపరచుకున్న భూములను వ్యవసాయ కూలీలకు, పేద రైతాంగానికి పంచాలి. భూమి రక్షించుకోవడానికి

రైతాంగానికి సాయుధం కావలసిన అవసరాన్ని గుర్తింపచేస్తూ సాయుధులు చేసే కార్యక్రమాలను ముమ్మరం చేయాలి. భూ పంపిణీ చేపట్టడానికి ఉద్యమం ఈ కింది మార్గదర్శక సూత్రాలు రూపొందించుకుంది. ఆచరణలో ఎదురైన కొన్ని సమస్యలకు కూడా ఇందులో మార్గదర్శనం ఉంది.

**భూ పంపిణీ నియమాలు**

1. వచ్చే సంవత్సరం ఆక్రమిత భూములన్నింటిని సాగులోకి తేవడానికి గాను ఆ భూములన్నింటిని వ్యవసాయ కూలీ, పేద రైతులకు పంపిణీ చేయాలి. అందుకుగాను భూ ఆక్రమణలు జరిగిన గ్రామాలన్నింటిలో వర్గ విశ్లేషణకు సంబంధించిన డేటా సేకరించాలి. వ్యవసాయ కూలీ, పేద రైతులకు మాత్రమే భూమి పంచాలి. వ్యవసాయ కూలీలకు మొదట ప్రాధాన్యం ఇచ్చి కనీసం రెండెకరాలు వచ్చేలా చూడాలి. ఆపై పేద రైతులకు వారికున్న భూమి పరిమాణాన్ని బట్టి పంపిణీ చేయాలి.
2. పేద రైతులు అనగా కొన్ని ప్రాంతాల్లో 5 ఎకరాల లోపు వాళ్ళను, కొన్ని ప్రాంతాల్లో 3 ఎకరాల లోపు వాళ్ళను అక్కడి భూమి నాణ్యతను బట్టి పరిగణించాలి.
3. భూ ఆక్రమణలు జరిగిన గ్రామాల జనం నిర్బంధం రీత్యా భూములు చేసుకోవడానికి సిద్ధపడకపోతే పొరుగున ఉన్న గ్రామాలవారు దున్నడానికి సిద్ధపడితే వారికి పంపిణీ చేసి దున్నించాలి. అయితే ముందు ముందు సదరు భూమి ఉన్న గ్రామం వారిలో చైతన్యం పెరిగి భూములు చేసుకోవడానికి ముందుకు రావచ్చుననే దృష్టితో ముందు ముందు వారికి కొంత వాటా ఇవ్వాల్సి ఉంటుందని ప్రస్తుతం భూములు దున్నడానికి సిద్ధపడినవారికి చెప్పాలి. అలా భవిష్యత్తులో జనం మధ్య సమస్యలు తలెత్తకుండా సామరస్యంగా భూములు చేసుకోవడానికి అవగాహన కలిగిస్తూ ఎడ్యుకేట్ చేసుకోవాలి.
4. ఆక్రమిత భూముల్లో వ్యక్తులుగా రైతులకు చెందిన భూములు ఏవైనా భూస్వాములకు పోగొట్టుకున్నవి ఉంటే అలాంటివారికి (మధ్య తరగతి రైతు వరకు మాత్రమే) పంపిణీ వాటా ఇవ్వాలి కాని భూస్వామికి పోగొట్టుకున్న మొత్తం భూమి ఇవ్వరాదు. అతను కోరితే పంపకంలో వచ్చే వాటా అతను పోగొట్టుకున్న భూమిలో ఇవ్వవచ్చు.
5. భూమిని ఆక్రమించిన గ్రామాలలో పేద గిరిజన-గిరిజనేతరులుంటే గిరిజనుల్లోని వ్యవసాయ కూలీలకు, పేద రైతులకు మొదట ప్రాధాన్యం ఇవ్వాలి. ఒకవేళ వీరు దున్నడానికి సిద్ధపడకపోతే గిరిజనేతర వ్యవసాయ కూలీ-పేద రైతాంగానికి పంపిణీ చేయాలి. ఇందులో కూడా పేద గిరిజన-గిరిజనేతరుల మధ్య ఐక్యత చెడిపోకుండా కాపాడాలి. అభివృద్ధి చేయాలి.
6. మన పోరాటంలో చురుకుగా పాల్గొన్న సంఘ నాయకత్వం ధనిక రైతులు, మధ్యతరగతి రైతులైనప్పుడు భూమిలో వాటా కోరకుండా వారిని ఎడ్యుకేట్ చేసుకోవాలి.
7. భూమి పంపిణీ చేసేటప్పుడు గిరిజనులైన-గిరిజనేతరులైన వ్యవసాయ కూలీ పేద రైతాంగానికి భూమి పంపిణీ చేయాలి. ఒకవేళ వీరు సిద్ధపడకపోతే భూమి బీడుగా ఉన్నా ఫర్వాలేదు. కాని మధ్యతరగతి రైతాంగానికి ధనికి రైతాంగానికి పంపిణీ చేయరాదు.
8. భూ ఆక్రమణలోనూ, భూమిని సేద్యం చేయడంలోనూ మధ్య తరగతి, ధనిక రైతాంగం సహాయాన్ని (ఎడ్లు, నాగళ్లు వగైరా) పొందడానికి ప్రయత్నం చేయాలి.
9. ధనిక రైతాంగం భూములను ఆక్రమించడం జరగదని భూస్వామ్యవర్గాల్లో తేడాను బట్టి వర్గ పోరాటంలో వారి వైఖరి బట్టి తేడాలు చూడడం జరుగుతుందని స్పష్టం చేస్తూ ప్రచారం చేయాలి.
10. ఏ గ్రామానికి ఆ గ్రామంలో భూమి పంపిణీ కమిటీలను ఏర్పాటు చేయాలి. అవి ఈ కింది వారితో కూడుకుని ఉండాలి.
    - ఎ. వ్యవసాయకూలీలు-2
    - బి. పేదరైతాంగం-2
    - సి. మధ్యతరగతి -1
    - డి. ధనికరైతాంగం-1
    - ఇ. సంఘ నాయకులు-1 మొత్తం ఏడుగురు

**రెడీమేడ్ పరిష్కారాలు ఉండవు**

విప్లవాల కాలంలో ప్రతి విషయం రెడీమెడ్‌గా పరిష్కారం కాదు. ఎందుకంటే విప్లవకాలంలో ఘటనాక్రమం చాలా వేగంగా ఉండడమే అందుకు కారణం. వ్యక్తులుగా పాల్గొనే పోరాటాల్లో, కార్యక్రమాల్లో క్రమం తప్పని సూత్రాలను మొదటి నుండి అమలు చేయగలం. సామూహిక ఉద్యమాల్లో వివిధ వర్గాల ప్రజలు వేలాదిగా, లక్షలాదిగా కదిలే ఉద్యమాల్లో అందరినీ ఒకే తీరులో ఆలోచింపజేసే భావ సమైక్యత తీసుకురావడానికి అవసరమయ్యే క్రమం ఒకటి ఉంటుందని గుర్తించాలి. విప్లవోద్యమం తర్ఫీదు, అశేష జనసామాన్య తర్ఫీదు-ఏక కాలంలో జరగాల్సినవే. అయినా వాటి చైతన్యాలలోని తేడాను గుర్తించాలి.

విప్లవ శక్తులు ప్రజలను నడిపించేందుకు వేసే పథకాలు నిర్బంధ రాజ్యమవలంబించే ఎత్తుగడలపైన, జాతీయ పరిస్థితి పైన ఆధారపడి ఉంటాయి. ఉద్యమంలో ఎదురయ్యే ఎగుడు దిగుడులు కూడా గమనంలో ఉండాలి. ఈ నేపథ్యంలో భూముల ఆక్రమణ స్వాధీన కార్యక్రమాలను పరిశీలించాలి. నిరాయుధులైన రైతాంగం సాయుధం కాకుండా భూములను నిలబెట్టుకోలేరని చరిత్ర రుజువులతో సహా నిలిచి ఉంది. రైతాంగానికి తనదంటూ సైన్యం ఏర్పడకుండా బడాభూస్వామ్య బడాబూర్జువా ప్రభుత్వ సేనలను ఎదిరించలేదు. ఇటు తెలంగాణాలోనూ, దండకారణ్యంలో రూపొందిన మార్గదర్శక సూత్రానుసారం జరగబోయే పోరాటాలను రెండవదశగా పేర్కొంటూ, పారా మిలటరీ స్థానే ఏ బలగాలు దిగుతాయో ఊహించాలి. అందుకు మానసికంగా రైతాంగాన్ని, ఉద్యమాన్ని సంసిద్ధం చేయాలి. మనం నూతన పోరాటాలు ఆవిష్కృతమయ్యే దశలో ఉన్నాం. నూతన ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కోవాలి. నూతనత్వాన్ని ఆహ్వానించే వారందరికి ఇది పరీక్షా సమయం. ఈ పరీక్షను రక్తాక్షరాలతో లిఖిస్తూ ముందుకు సాగుతారని ఆశిద్దాం. (మార్చి 1990)

భూసంస్కరణలు

# భూ సమస్యపై సరియైన అవగాహన

స్వర్గీయ పుచ్చలపల్లి సుందరయ్య

(భూ సంస్కరణల గురించి 1970 సంవత్సరం ఆఖరులో సుందరయ్య రాసిన వ్యాసాన్ని సంక్షిప్తీకరించి ఆ దిగువన ఇస్తున్నాం- సం)

ఆంధ్రప్రదేశ్‌లో జనాభా సుమారు అయిదారు కోట్లు. ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు నాలుగు కోట్ల మంది వ్యవసాయం, దాని ఉప వృత్తుల మీద జీవిస్తున్నారు. వ్యవసాయం మీద జీవించే ఈ కోట్లాది ప్రజల జీవిత సమస్య పరిష్కారంగానిదే, వారికి సంవత్సరం పొడవునా పని, వారి కుటుంబ పోషణకు కావాల్సిన కనీస జీవిత భృతి అయినా గ్యారంటీ చేయనంతకాలం దేశంలో పురోభివృద్ధి ఏ రంగంలోనూ చెప్పుకోదగినంతగా జరగదు.

అయితే వ్యవసాయం మీద జీవించేవారంతా, భూమి మీద కష్టపడి పనిచేసి జీవించడం లేదు. కొంతమంది భూమి మీద కాయకష్టం చేయకుండానే భూమిని కౌలుకిచ్చి సాగుచేయించుకొని, వచ్చిన కౌలు ఫలితాన్ని అనుభవిస్తూ జీవిస్తున్నారు. లేదా భూముల మీద అన్ని ముఖ్య వ్యవసాయ పనులలో కూడా సంవత్సరం పొడవునా కాయకష్టం చేయని కుటుంబాలను, కేవలం భూములను కౌలుకిచ్చి ఫలసాయాన్ని అనుభవించే వారిని, లేదా అజమాయిషీ చేస్తున్న, ముఖ్య వ్యవసాయ పనులన్నింటినీ పాలేర్ల చేత, రోజు కూలీల చేత చేయించికొని ఫలసాయాన్ని అనుభవించే వారందరినీ భూస్వాములుగా మనం పరిగణించవలసి వుంది. భూమి మీద అన్ని ముఖ్య వ్యవసాయ పనులలోను సంవత్సరం పొడవునా సొంతంగా కాయకష్టం చేసుకొని వచ్చిన ఫలసాయాన్ని అనుభవించే వారినందరినీ మనం రైతులుగా పరిగణిస్తాం.

**ధనికరైతు:**

కొంతమంది తమ సొంత భూములు లేదా కౌలుకు తీసుకున్న భూములు, మొత్తం తాము సాగుచేస్తున్న భూముల మీద తాము అన్ని ముఖ్య పనులలోను కాయకష్టం చేయడంతో పాటు, పాలేర్లను పెట్టుకుంటారు. పని ముమ్మరంగా ఉన్న రోజులలో ముఖ్యంగా నాటు వేతలు, కలుపుతీతలు, కోతలు, నూర్పిళ్ళలో పాలేర్లనే గాక, రోజు కూలీలను కూడా పెట్టుకుంటారు. తమ కుటుంబంలో నున్నవారు సంవత్సరం పొడవునా వ్యవసాయంలో పనిచేసే రోజులకన్నా, ఈ కూలీలచేత, పాలేర్ల చేత పని చేయించుకొనే రోజులు ఎక్కువగా ఉంటాయి. అంటే వీరు తమ సొంత ఆర్జితాన్నే గాకుండా, కూలీల, పాలేర్ల పని ఫలితాన్నుండి అదనపు విలువను కూడా భుక్తం చేసుకొంటున్నారు. ఇలాంటి కుటుంబాలను మనం ధనిక రైతులుగా పరిగణించాలి.

**మధ్య తరగతి రైతు:**

తమ సొంతం లేదా కౌలు భూమి మీద మొత్తం తాము సాగుచేస్తున్న భూమి మీద, తమ కుటుంబం సంవత్సరం పొడవూ అన్ని ముఖ్య పనులలో కాయకష్టం చేసి పంటలు పండిస్తారు. వీరిలో చాలామంది చిన్న పాలేర్లను ఇంటి పనులకోసం, వ్యవసాయ పనులు, గేదెలు తదితర పశువుల కాపరి పనిచేయడానికి పెట్టుకుంటారు. ముమ్మర పని తరుణాలలో నాటువేతలు, కోతలలో రోజు కూలీలను పెట్టుకుంటారు. వీరి కుటుంబశ్రమ రోజులు, ఈ కూలీ పని రోజుల కన్న అత్యధికంగా ఉంటాయి. కుటుంబార్జితం కన్న పరార్జితం తమ మొత్తం ఆదాయంలో చాలా తక్కువగా వుంటుంది. వీరికి వ్యవసాయం మీద వచ్చే నికరాదాయం వారి మామూలు కుటుంబ పోషణకు బొటాబొటిగా సరిపోతుంది. చాలా మందికి లోటు కూడా వస్తుంది. పంటలు బాగా పండి అన్నీ సవ్యంగా కలిసివచ్చిన సంవత్సరంలోనే పెట్టుబడిగా వినియోగించగలిగిన మోతాదులో మిగలవచ్చు. ఇట్టి కుటుంబాలను మధ్యతరగతి కుటుంబాలుగా పరిగణిస్తాం.

**ధనిక రైతుకు , మధ్యతరగతి రైతుకు మధ్య గీటురాయి:**

మధ్యతరగతి రైతు కుటుంబంలో శ్రమశక్తి రోజులు, కూలీ పాలేర్ల పనిరోజుల కన్న ఎప్పుడూ ఎక్కువగా ఉంటాయి. రెండవ గీటురాయి: ధనిక రైతు కుటుంబానికి సామాన్యంగా ఏటేటా పెట్టుబడిగా పెట్టుకోగల్గిన మేరకు ఆదాయం మిగులుతుంది. మధ్యతరగతి రైతుకు ఈ విధంగా సామాన్యంగా మిగలదు. చాలామందికి లోటుకూడా వస్తుంది. అపురూపంగా మాత్రమే మంచి సంవత్సరాలలోనే మిగులుతుంది.

**పేద రైతు:**

పేద రైతు కుటుంబానికి, తమ వ్యవసాయం మీద వచ్చే నికరాదాయం, తమ నికృష్ణ మామూలు కుటుంబ పోషణ కూడా చాలదు. ఎప్పుడూ లోటుగానే వుంటుంది. అందుచేత, ఇతరుల క్రింద కూలిపనికి గాని, లేక తన ప్రధాన వ్యవసాయాదాయానికి సహాయంగా మరేదైనా తాత్కాలిక ఉపవృత్తులు చూచుకుంటూ జీవితం గడుపుతూ ఉంటాడు. పేదరైతు ఇతరులను కూలికి పెట్టుకొని ఆ కూలీ శ్రమశక్తిని దోచుకోడు. ఎప్పుడయినా వ్యవసాయ పరిస్థితిని బట్టి కూలీలను పెట్టుకున్నా తాను కూడా బదులుగా గాని లేక ఇతరుల క్రింద కూలికి గాని పోతుంటాడు.

**వ్యవసాయ కార్మికులు:**

వ్యవసాయ కార్మికులు తమ శ్రమశక్తిని అమ్ముకొని కూలిపని మీద ప్రధానంగా జీవిస్తాడు. వీరిలో కొంతమంది కొద్దిపాటి భూమి, ఎకరం, అర ఎకరం వున్నా ప్రధాన కుటుంబ ఆదాయం భూమిమీద గాక, వ్యవసాయ కూలి పనుల నుండి గాని లేక తదితర వ్యవసాయ

ఉపవృత్తులలో కూలి చేసుకోవడం వల్ల గాని వస్తుంది. ఇట్టి కుటుంబాలన్నింటినీ మనం వ్యవసాయ కార్మికులుగా పరిగణిస్తాం.

మనం ఒక సమస్యను తీసుకొని సాధించుకోవడానికి పోరాడబూనుకున్నప్పుడు మనం ఎదుర్కోవలసిన శక్తులు నూటికి పదికి మించకుండా ఉండేట్లు చూసుకోవాలి. మిగిలిన 90 మందిని కలుపుకురావడానికి గట్టిగా ప్రయత్నించాలి. ఎందుకంటే, ఏ సమయంలోనైనా, ఏ సందర్భంలోనైనా మన ప్రత్యర్థి బలం, సంఖ్య ఎంత కొద్దిగా వుంటే, మన బలం, మన మిత్రబృందాల బలం ఎంత ఎక్కువగా వుంటే అంత తేలికగా మనం మన కోర్కెలను విజయవంతంగా సాధించుకోగలం. ఒక విజయం సాధించితే, దాని అనుభవంతో, ఫలితంతో, మరింత విశ్వాసంతోను, చొరవతోను, మరింత అదనంగా కష్టజీవులు కదలి దోపిడీ వర్గాలకు వ్యతిరేకంగా పోరాడడానికి ముందుకు వస్తారు. మరింత పెద్ద కోర్కెలను ఒక దాని తరువాత మరొకటి సాధించుకొంటూ ముందుకు పోగలుగుతారు. మన గ్రామసీమలలో ప్రతి కుటుంబాన్ని పై కొలబద్దతో, పై అవగాహనతో పరిశీలించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

సెంటు, కుంట కూడా భూమిలేని వ్యవసాయ కార్మిక కుటుంబాలు పూర్తిగా తమ శ్రమశక్తిని అమ్ముకొని రోజు కూలీలుగానో, నెలసరి లేదా సాలుసరి జీతగాళ్ళగానో జీవించేవారు; ఎకరం మాగాణి భూమి, రెండు మూడు ఎకరాలు మెట్టకులోపు భూమి ఉండికూడ ప్రధానంగా కూలిచేసుకొని జీవించే కుటుంబాలు; గ్రామసీమలలో వ్యవసాయ ఉత్పత్తులలో కూలిమీద ప్రధానంగా జీవిస్తున్న కుటుంబాలు-వీరు మొత్తం ఆంధ్రప్రదేశ్ జనాభాలో నూటికి 50 మందికి తగ్గకుండా ఉన్నారు. సుమారు 50 లక్షల కుటుంబాలు, వ్యవసాయ కార్మిక కుటుంబాలుగా ఉంటున్నాయి; వీరి చేతులలో వున్న భూమి 10 లక్షల ఎకరాలకు మించదు.

మరోవైపు పది ఎకరాలకు మించి మాగాణి భూమిగాని లేదా 20 ఎకరాలకు మించిన మంచి మెట్టభూమి గాని కలిగిన కుటుంబాలు, భూమిమీద కుటుంబాలలోని ఏ ఒక్కరూ ముఖ్యమైన వ్యవసాయ పనులలో సంవత్సరం పొ ూ కాయకష్టం చేయకుండా అజమాయిషీ చేస్తూ పాలేర్లతో, రోజు కూలీలతో సాగుచేయించుకునే కుటుంబాలు లేదా తమ భూములను కౌలుకిచ్చి వచ్చిన పరార్జిత ఆదాయంతో జీవించే కుటుంబాలు-ఇలాంటి భూస్వామ్య కుటుంబాలు మొత్తం జనాభాలో నూటికి నాలుగుపాళ్ళకు మించకుండా వున్నాయి. వీరి సంఖ్య సుమారు మూడులక్షల మధ్య ఉంటుంది. అయితే మొత్తం సాగు అయ్యే భూమిలో నూటికి 40 పాళ్ళకు పైగా వీరిచేతిలో వుంది. వీరి స్వాధీనం వున్న భూములు సుమారు కోటి ఎకరాలు.

ఒక ఎకరం నండి రెండు ఎకరాలవరకు మాగాణిగాని లేదా రెండు ఎకరాలు మొదలు ఐదు ఎకరాలవరకు మెట్టభూమిగాని కలిగి సాగుచేసుకొంటున్న కుటుంబాలు కుటుంబమంతా కష్టపడి కాయకష్టం చేసినా వీరికి ఆ భూకమతాల నుండి వచ్చే నికరాదాయం తమ కుటుంబ పోషణకు చాలక నిరంతరం అప్పులపాలౌతూ ఇతరుల క్రింద కూలికి గానీ లేదా ఇతర వృత్తులలో కొద్దిగా సంపాందించుకొంటూ ఏదోవిధంగా తమ జీవితాన్ని నికృష్టంగా గడుపుకొనే పేదరైతు కుటుంబాలు నూటికి 15 వరకు వున్నాయి. ఇలాంటి పేదరైతు కుటుంబాల సంఖ్య సుమారు 15 లక్షలు వుంటాయి. వీరి స్వాధీనంలో భూములు సుమారు 40 లక్షల ఎకరాలు. మొత్తం వ్యవసాయ కార్మికుల, పేదరైతుల చేతులలో వున్న భూములు 20 శాతం కన్నమించవు.

రెండు ఎకరాలనుండి ఐదు ఎకరాలవరకు మాగాణి భూమిగాని, ఐదు ఎకరాలనుండి పది పండ్రెండు ఎకరాలవరకు మెట్టభూమి గలిగి తమ కుటుంబమంతా దానిపై కాయకష్టం చేసుకుంటూ కుటుంబపోషణకు సరిపడ ఫలసాయం పొందుతూ వుండే కుటుంబాలు, చిన్న పశువుల కాపరులను, పని ఒత్తిడి రోజులలో కొద్దిగా రోజు కూలీలను పెట్టుకున్నా, తమ కుటుంబ శ్రమమీదనే ప్రధానంగా ఆధారపడే కుటుంబాలు-మధ్యతరగతి కుటుంబాలు నూటికి 10 వరకు వున్నాయి. ఇలాంటి కుటుంబాల సంఖ్య సుమారు 10 లక్షలు ఉన్నాయి. వీరి స్వాధీనంలోవున్న భూములు 40 లక్షల ఎకరాలు, మొత్తం భూమిలో 20 శాతం.

ఐదు, పది ఎకరాల మధ్య మాగాణి భూమిగాని లేదా పది, ఇరవై ఎకరాల మధ్య మెట్టభూమిగాని కలిగి కుటుంబంలోనివారు ముఖ్య వ్యవసాయ పనులలో కాయకష్టం చేసుకొంటూనే పాలేర్లను, రోజు కూలీలను అదనంగా పెట్టుకుంటారు. వచ్చే ఆదాయం కుటుంబం పోషణకుపోను, ఏటేటా మిగులుతూ పెట్టుబడిగా వినియోగించుకోవడానికి ఉపయోగపడేటంతగా లభ్యమవుతుంది. ఇలాంటి కుటుంబాలు ధనికరైతు కుటుంబాలు నూటికి 5 పాళ్ళు వుంటాయి. వీరి సంఖ్య 5 లక్షలు వుంటుంది. వీరి చేతులలో వుండే భూమి సుమారు 50 లక్షల ఎకరాలు. భూస్వాములు, ధనిక రైతుల చేతులలోవున్న భూమి 60 శాతం వరకు వుంటుంది. (ఇవి స్థూలమైన అంచనాలు)

అత్యధిక సంఖ్యలో ముందుకు వస్తున్నారు. అందుచేత ఎక్కువ కౌలురేట్లకు భూమిని కౌలుకివ్వడం లేదా తక్కువ కూలిరేట్లకు వచ్చే కూలీలతో వ్యవసాయం చేయించుకోవడం లాభసాటిగా వుంది కాబట్టి కాయకష్టం చేసి సొంతంగా వ్యవసాయం చేయకుండా, ఈ పరార్జిత ఫలసాయం అనుభవించడం జరుగుతూ ఉంది. కాని వ్యవసాయ కార్మికుల, కౌలు రైతుల చైతన్యం, సంఘటన పెరిగి తమ న్యాయమైన హక్కుల కోసం చేసే పోరాటాలు పెరిగేకొద్దీ వీరిలో చాలామంది సొంతంగా కాయకష్టం చేసి సాగుచేసుకోవడానికి ముందుకు వస్తారు.

ఇలాంటి చిన్న భూకామందులు, మరొక తరహాకు చెందినవారు. వీరు అత్యధిక సంఖ్యాకులు, వీరు తమ భూములలోనుండి వచ్చే

ఆదాయం చాలక, దానిని కౌలుకిచ్చి, తాము ఇతర వృత్తులలోకీ, ఫ్యాక్టరీలలో పనిచేయడానికి, ప్రభుత్వ ఉద్యోగాలలోకి, గుమాస్తాలుగా, ఉపాధ్యాయులుగా, లేక చిన్న పరిశ్రమలను, వ్యాపారాలను చేసుకుంటూ జీవించే వారున్నారు. వీరికి వ్యవసాయం మీద నుండి వచ్చే ఆదాయం పరార్జితమైనా తమ జీవితానికి సహాయంగా వుంటూ వుంది. ఇట్టివారు తమ ప్రధాన జీవన వృత్తులు వదలుకొని సొంతసాగు చేసుకోవడానికి తిరిగిరావడం చాలా అరుదు. అందువలన ఇట్టి చిన్న భూకామందులకు పూర్తి మార్కెట్టు ధర ఇచ్చి ప్రభుత్వం ఆ భూములను వ్యవసాయ కార్మికులకు, పేద రైతులకు ఉచితంగా పంచి పెట్టవలసి వుంటుంది.

ఈ వృత్తులలో భూస్వాములకు వచ్చే ఆదాయాలకన్న తగ్గకుండా ఎక్కువ ఆదాయాలు వస్తున్న వారిని భూస్వాములుగానే పరిగణించి వీరి విషయం, చర్యలు తీసుకోవలసి ఉంటుంది.

**భూపోరాటం:**

పైన వివరించిన విధంగా 50 లక్షల మంది వ్యవసాయ కార్మిక కుటుంబాలలో చేతులలో 10 లక్షల ఎకరాలకు మించిలేదు. కుటుంబానికి 20 సెంట్లకన్నా భూమిలేదు. 15 లక్షల పేదరైతుల చేతులలో 40 లక్షల ఎకరాలు వుంది. వీరికి ఒక్కొక్క కుటుంబానికి సగటున రెండుమూడు ఎకరాలలోపునే భూమి వుంది. ఈ కొద్దిపాటి భూమి ఆ కుటుంబాలు పనిచేసుకోవడానికి ఏమాత్రం చాలదు. సంవత్సరంలో 200 రోజుల వరకు పనిలేని స్థితిలోనే వ్యవసాయ కార్మికులు ఉంటున్నారు. వీరికి సంవత్సరంలో 300 రోజులకు పని కల్పించాలంటే అందుకు కావలసిన పరిశ్రమలు తదితర వృత్తులు కల్పించడానికి వేలకొలది కోట్ల రూపాయలను పెట్టుబడి పెట్టవల్సి ఉంటుంది. ధనం మాత్రమే గాక అలాంటి పరిశ్రమలు నిర్మించడానికి దశాబ్దాలు పట్టుతాయి. ఈ లోపల ఈ కోట్ల కొలది వ్యవసాయ కార్మికులు, పేదరైతులు నిరుద్యోగంతో, పస్తులతో జీవిస్తూ వుండాలనడం సమంజసం కాదు. అలా అనడం సహించరాని విషయం. అందుచే ముందు సాధించవలసిన పని, ఈ కోట్లకొలది వ్యవసాయ కార్మికులకు పేదరైతులకు మరింత అదనంగా పని కల్పించి వారి ఆదాయాన్ని వారి కనీస పోషణకు కావలసిన మోతాదులోనయినా పెంపొందించవలసి వుంటుంది.

దీనికి వెనువెంటనే సాధ్యమయ్యేది, చేయవల్సిన పని, నేడు స్వయంగా కాయకష్టం చేయకుండా పరాన్నభుక్కులుగా జీవిస్తున్న భూస్వాముల వద్దనున్న అదనపు భూములన్నిటిని స్వాధీనం చేసుకొని వ్యవసాయ కార్మికులకు ఎక్కువభాగం, పేదరైతులకు కొంతభాగం పంచి పెట్టడం ఒక్కటే మార్గం. ఈ భూస్వాములు తమ పాత సోమరి జీవితాన్ని వదలి స్వయంగా కాయకష్టంతో భూములను సాగుచేసి జీవించడానికి ముందుకు వస్తే వారికి కూడా వారి కుటుంబం పనిచేసుకోగల్గిన మేరకు కావల్సిన భూమిని ధనిక రైతు కుటుంబస్థాయి జీవితాన్ని అనుభవించడానికి కావాల్సిన భూమిని వదలిపెట్టవలసి ఉంటుంది. అలా స్వయంగా కాయకష్టం చేసి సాగు చేసుకోవడానికి తయారు కాని వారికి లేదా ఇతర వృత్తులు, ఉద్యోగాలు ఉండి నెలకు రు. 500లకు మించి ఆదాయం వస్తూ కుటుంబపోషణకు ఇబ్బందిలేని వారికి భూములు వదలవలసిన పనిలేదు.

పది ఎకరాల మాగాణి భూమి లేక 30 ఎకరాల మెట్టభూమికి మించిన కుటుంబాల వారందరూ స్వయంగా కాయకష్టం చేయని కుటుంబాలుగా వున్నారు. కాబట్టి వారిని భూస్వాములుగా పరిగణించవచ్చునని పైన చూశాం.

అందువల్ల వీరివద్దనున్న భూములన్నింటిని మన స్వాధీనం చేసుకుంటే వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు పంచి పెట్టడానికి సుమారు 80 లక్షల ఎకరాలు సాగుభూమి లభ్యమవుతుంది. వ్యవసాయ కార్మిక కుటుంబాల చేతులలోను, పేదరైతు కుటుంబాల చేతులలోను వున్న 50 లక్షల ఎకరాల భూమిని కూడా కలుపుకొని పంచితే ప్రతి వ్యవసాయ కార్మిక, పేదరైతు కుటుంబానికి సుమారు రెండు ఎకరాల వంతున భూకమతాలు ఏర్పడుతాయి.

ఆంధ్రప్రదేశ్ భూస్వాముల వద్దనున్న ఈ అదనపు భూములే గాక, సాగుకు లాయకు అయిన బంజర్లు, పచ్చిక భూములు అడవి పేరుతో నమోదు చేసిన చెట్లులేని సాగుకు పనికి వచ్చే అడవి బంజర్లు, పడావులు మరో రెండు కోట్ల ఎకరాలున్నవి. వీనిని కూడ కొన్ని సంవత్సరాలలో క్రమంగా సాగులోకి తెచ్చే కొద్దీ వ్యవసాయ కార్మిక, పేదరైతు కుటుంబాలకు సగటున ప్రతి కుటుంబానికి మరో రెండు మూడు ఎకరాల భూమిని అదనంగా పంచిపెట్టడం సాధ్యమవుతుంది.

వ్యవసాయ కార్మిక కుటుంబాలన్నింటిని కలిపి పోరాటంలో తీసుకురావాలన్నా, వారి సమస్యను ఒక మోతాదులోనైనా పరిష్కరించాలన్నా, ప్రతి గ్రామంలోను భూస్వాముల వద్దనున్న అదనపు భూములను (వారు సొంత కాయకష్టంతో సాగు చేసుకోని భూములన్నింటినీ) స్వాధీనం చేసుకొని పంచుకొనే కార్యక్రమాన్ని ప్రచార ఆందోళనతో పోరాడిసాధించుకోవటమే ప్రధాన సమస్య అవుతుంది. బంజరు పోరాట సమస్య, కూలిరేట్లు, అప్పులు తదితర సమస్యలన్నీ ఈ సమస్యకు అనుబంధించిన ఉప సమస్యలు మాత్రమే. అది వ్యవసాయ కార్మిక, పేదరైతు కుటుంబాలకు అనుకూలంగా, భూస్వాములు పెత్తనాన్ని వారి గుత్తాధికారాన్ని బ్రద్దలు కొట్టడానికి వారి వద్దనున్న అదనపు భూములన్నిటిని పంచుకునే ఉద్యమం జయప్రదం కానంతవరకు ఈ పాక్షిక విజయాలు సాధిస్తూ వచ్చినా వాటిని తిరిగి తిరిగి ఈ భూస్వాములు తమ బలాన్ని పుంజుకొని దెబ్బగొట్టడానికి ప్రయత్నిస్తూనే ఉంటారు. అందుచేతనే భూస్వామ్య విధానాన్ని రద్దు చేయనంతకాలం "దున్నే వారికే భూమి" అనే నినాదాన్ని అమలు జరపనంతకాలం ఈ సమస్యలు ఏవీ పరిష్కారం కావు.

1946-51 మధ్య జరిగిన తెలంగాణా పోరాట ఫలితంగా ఆనాటి ప్రభుత్వం తెలంగాణాలో కౌలుదార్లకు రక్షిత కౌలుదార్లని, వారి స్వాధీనంలోనున్న భూములను తక్కువ ధరకు కొనుక్కోడానికి

అవకాశమిస్తూ, తక్కువ కౌలురేట్లు నిర్ణయించి జిరాయితీ హక్కు కొంతవరకు ఇచ్చింది. కాని అదికూడ అమలులోకి వచ్చేటప్పటికి సగానికన్నా ఎక్కువమందిని భూమినుండి తొలగించారు.

నేడు ఆంధ్రప్రదేశ్‌లో కౌలురేటు పండిన పంటలో సగం నుండి మూడుపాళ్ళ వరకు ఉంటుంది.

పది పన్నెండు ఎకరాలలోపు సొంతగా కాయకష్టం సాగుచేసుకొంటున్న కౌలుదార్ల నుండి కౌలు భూములను ఏ పరిస్థితిలోను స్వాధీనం చేసుకోరాదని మనం వెనువెంటనే ఉద్యమాన్ని ప్రారంభించాలి.

కౌలు రేటు నాల్గవవంతుకు తగ్గాలని మనంచేసే ఆందోళన ఆచరణలో అమలులోకి రావాలంటే కౌలు రైతును భూమినుండి తొలగించకుండా గ్యారంటీ వుండాలని, ఆ భూమి మీద కౌలు రైతుకు జిరాయితీ హక్కు కల్గించాలనీ పోరాడాలి. ఆ తదుపరి పట్టాహక్కు వచ్చినప్పుడే పూర్తిగా భూస్వామ్యదోపిడీ అంతమవుతుందనీ, కౌలురైతు నిశ్చింతగా కనీస జీవిత భృతి సాధించుకొని జీవించడానికి సాధ్యమవుతుందనే చైతన్యం కూడా మనం కలిగించాలి. కౌలు రైతు పండించిన పంటలో భాగం యజమాని అనే పేరుతో పరార్జితం అనుభవించడానికి ఎవ్వరికీ హక్కులేదు. 'దున్నేవానిదే భూమి' అనే సత్యాన్ని ప్రజలలో అవగాహనకు తేవాలి.

**వ్యవసాయ కార్మికుల కూలిరేట్లు:**

**వారిని దోచుకొనే వివిధ పద్ధతులు**

వ్యవసాయ కార్మికులకు భూమి ఏమీ లేకపోవడంవల్ల, భూస్వాములు, ధనిక రైతులవద్ద రోజు కూలికి గాని, పాలేర్ల (జీతగాండ్ర) గా గాని పనిచేస్తున్నారు. వారి రోజు శ్రమ ఫలితంగా వచ్చే వస్తూత్పత్తిలో చాల కొద్దిభాగం మాత్రం వారికిచ్చి చాలా ఎక్కువ భాగాన్ని భూ యజమాని కాజేస్తున్నాడు.

కూలిరేట్లను నిర్ణయించడానికి సరైన పద్ధతి ఈ క్రింద వివరించడమైనది.

ఆయా వ్యవసాయ పంటలు పండే ప్రాంతాలలో, ఒక కుటుంబం (భార్యాభర్త, చిన్నబిడ్డలుగల కుటుంబం) ఒక నాగలి, జత ఎడ్లతో ఎన్ని ఎకరాలు సంవత్సరం పొడవూ తమ సొంత కాయకష్టంతోను ఒత్తిడి పని తరుణాలలో రోజు కూలీలను పెట్టుకుని సాగుచేయగలదో, దానిని ఒక యూనిటుగా, ఆర్థికంగా గిట్టుబాటయ్యే ఒక వ్యవసాయ క్షేత్రంగా (భూకమతంగా) గమనంలోకి తీసుకోవాలి. ఈ వ్యవసాయ కమతంలో, ఎన్ని రకాల పంటలు సంవత్సరంలో పండించేది. ప్రతి ఒక్క పంటకు, భూమిని దున్ని పైరు వేయడానికి తయారు చేయడం లేదా నాటువేయడం, కలుపుతీతలు, నీటిపారుదల, కోత, మార్పిడికి మొత్తం ఎన్ని పనిరోజులు పట్టేది లెక్కవేయాలి. మొత్తం అన్ని పంటలకు కలిపి సంవత్సరంలో ఎన్ని పనిరోజులు పట్టేది లెక్కవేయాలి. వివిధ పంటలలో వచ్చే ఫలసాయం, దాని ధర రైతులకు లభ్యమయ్యే ధరలతో, (గేదెలు, ఆవుల పాలమీద వచ్చే ఆదాయం, కూరగాయలు, వ్యవసాయానికి అనుబంధ వృత్తులలో వచ్చే తదితర ఆదాయాలు కూడా లెక్కలోకి తీసుకోవాలి)

బండి, నాగలి, తదితర పనిముట్లు, ఎద్దులు ఇవి ఎన్ని ఏండ్లు, పని చేస్తాయోచూచి, ఆ దామాషాన సంవత్సరానికి ఖర్చు (అరుగుదల ఖర్చుగా) తీసుకోవాలి. విత్తనాలు, ఎరువులు ఇతర ఖర్చులు మొత్తం ఎంత అయ్యేది లెక్కవేయాలి. కుటుంబం పనిరోజులుగాని, పాలేర్లు, రోజుకూలీల పనిరోజులుగాని, వారికిచ్చే జీతాలు ఇందులో కలపకూడదు. మొత్తం ఫలసాయం ఖరీదునుండి ఈ స్థిరఖర్చులు పోను మిగిలిన మొత్తం, పనిరోజుల ఫలితంగా తయారయిన నూతన విలువగా మనం పరిగణించాలి. ఒక పని రోజుకు ఎంత నూతనోత్పత్తి విలువను అది సృష్టిస్తుందో, దీనినిబట్టి మనం గుణించవచ్చు. న్యాయంగా భూమిమీద సాగుకు అందరికీ హక్కు ఉంటే ప్రతి ఒక్కరికీ తన శ్రమఫలితం పూర్తిగా దక్కేది. ఆ రీతిగా వ్యవసాయ కార్మికునికి అతనికి న్యాయంగా రావాల్సిన శ్రమఫలాన్ని, కూలిరేటుగా ఇవ్వడం లేదు. అందులో కొద్దిభాగం మాత్రమే భూయజమాని అతనికి ఇస్తున్నాడు. మిగిలినది తాను మిగుల్చుకుంటున్నాడు. ఈ వ్యవసాయ కార్మికునికి శ్రమ ఫలితం నుండే కూలిజీతం ఇవ్వగా మిగిలిన అదనపు విలువలోనుండే ప్రభుత్వానికి శిస్తు కట్టడంగాని, వ్యవసాయానికని తాను తెచ్చిన పెట్టుబడి అప్పులకు చెల్లించే వడ్డీనిగాని కట్టుతున్నాడు. ప్రభుత్వానికి కట్టవలసిన శిస్తు, పెట్టుబడిగా తెచ్చిన మొత్తానికి కట్టవలసిన వడ్డీనికూడా, మనం వ్యవసాయ ఖర్చులక్రింద మినహాయించి రోజు శ్రమ ఫలితం చూచినా, నేడు ఇస్తున్న రోజుకూలి, పాలేర్ల జీతాలు చాలా తక్కువగా వున్నాయని, ఎక్కువభాగం భూయజమాని మిగిల్చుకొంటున్నాడనేది స్పష్టమవుతుంది.

**విపరీతమైన వడ్డీరేట్లు, నాము జట్టీ తదితర దోపిడీ పద్ధతులు**

అందుచేత వ్యవసాయ కార్మికులకు, పేద రైతులకు ఇచ్చిన అప్పులు, రొక్కరూపంలో గాని ధాన్యరూపంలోగాని, యే రూపంలో ఇచ్చినా నూటికి నెలకు ఒక శాతం కన్నా వడ్డీరేటుగాని, నామురేటు గాని ఉండరాదని ఆ మేరకు ఆ గ్రామంలోని భూస్వామే అప్పుపెట్టాలని లేదా ప్రభుత్వం అలా అప్పులను ఇచ్చే యేర్పాట్లు చేయాలని, ఈ అప్పును తిరిగి ధాన్యరూపంలోగాని, రొక్కరూపంలో గాని, వ్యవసాయ కార్మికులు, పేద రైతులు తమకు వీలైన రూపంలో చెల్లించడానికి హక్కు వుండాలని, ఇది మన విధానంగా పెట్టుకొని ఆందోళన ఉద్యమం సాగించి ఈ హక్కులు సాధించుకోవాలి. పేరుకు పోయిన పాత అప్పులు, భూస్వాములకు, పెద్దవడ్డీ వ్యాపారస్తులకు ఇవ్వవలసిన వానిని రద్దుచేయాలి. చిన్నరైతులు, పేద మధ్య తరగతి రైతుల నుండి తెచ్చుకుని ఉన్న అప్పులను పై వడ్డీరేటు ప్రకారం లెక్కించి చెల్లించవలసి ఉంటే చెల్లించాలి.

**భూపోరాటానికి ఐక్య సంఘటన**

వ్యవసాయ కార్మికులు, పేదరైతులు, తమ జీవిత సౌకర్యాలను శాశ్వతంగా పెంపొందించుకోవాలంటే భూస్వామ్య విధానాన్ని రద్దుగావించి భూమిని సాధించుకోడానికి అనేక పాక్షిక సమస్యలమీద కలిసి పోరాడుతూ, తమ చైతన్యాన్ని, సంఘటనను

పెంపొందించుకొంటూ విస్తృత దేశవ్యాప్త పోరాటం చేసి జనతా ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకున్నప్పుడే సాధ్యమవుతుంది.

ఈ పాక్షిక పోరాటాలలోను అంతిమ భూపోరాటంలోను విజయం సాధించాలంటే నిరంతరం మధ్య తరగతి రైతులను తమలో సన్నిహితంగా దృఢంగా కలుపుకొని రావడానికి నిరంతరం పనిచేస్తూ ఐక్యసంఘటనలోకి తీసుకురావాలి. ధనిక రైతులను కూడా కలుపుకొని రావడానికి, భూస్వామ్యవర్గంతో వారు పూర్తిగా కలువకుండా కనీసం తటస్థంగా ఉండేట్లు మనకృషి ఉండాలి. పట్టణాలలోని కార్మిక వర్గంతో అవినాభావ సంబంధాలు ఏర్పరచుకోవాలి.

అంతిమ భూపోరాటానికి మెట్లుమెట్లుగా నేడు గ్రామాలలో జరుగుతున్న వివిధ రకాల దోపిడీకి వ్యతిరేకంగా పాక్షిక పోరాటాలు నడపాలి. కూలిరేట్లు పెంపుదల కోసం, కౌలురేట్లు, వడ్డీరేట్లు తగ్గింపు కోసం, ఇండ్లస్థలాల కోసం, కౌలుభూముల మీద జిరాయితీ తదితర పట్టా హక్కులకోసం; వివిధ రకాలైన బంజర్ల పంపకం, వాటికి పట్టాలకోసం; భూసీలింగు పరిమితులను తగ్గించి భూపంపకం కోసం; సాంఘిక తదితర పాతకాలపు జమిందారీ దోపిడీ పద్ధతులను రూపుమాపేందుకు, ఏ సమస్యను తీసుకున్నా, ఏ నినాదాన్ని రూపొందించినా, ఏ పోరాట రూపాన్ని అవలంబించినా అవి ఆయా ప్రాంతాలలోని వ్యవసాయ కార్మిక, పేదరైతుల చైతన్యస్థాయినిబట్టి సంఘటన బలాన్ని బట్టి నిర్ణయించవలసి వుంటుంది. ప్రతి సమస్యలోను మధ్యతరగతి రైతును ఖచ్చితంగా, సాధ్యమైనంత వరకు ధనిక రైతును కలుపుకొని రావడానికి సాధనంగా సమస్యలను తీసుకొనేటప్పుడు గ్రామాలలో విపరీతంగా దోచుకొనే పెద్ద భూస్వాములకు వ్యతిరేకంగా మొదట కేంద్రీకరించి పనిచేయాలి. అందువల్లనే కామ్రేడ్ లెనిన్ వ్యవసాయ కార్మికులను పేద రైతులను ఎప్పుడూ ఒకే సంఘంగా సంఘటిత పర్చాలని, వారిలో చీలికలకు దారితీసే ఏ చర్యా తీసుకోకూడదని గట్టిగా చెప్పాడు "గ్రామ పేదలు" అనే పేరుతో వారి సమస్యలను గూర్చి తరచూ చర్చించి వివరించాడు.

మధ్యతరగతి రైతులలో ఒక గణనీయమైన సంఖ్య రోజుకూలీలను, చిన్న పాలేర్లను చిల్లర మల్లర వ్యవసాయపనులకు పశువులను కాయడానికి, ఇండ్లలో అనేక పనులు చేయడానికి పెట్టుకుంటారని పైన చూశాం. అదే విధంగా వీరిలో కొంతమంది కొద్ది మొత్తంలో అప్పులు, ఎక్కువ వడ్డీలకు, నాము రేట్లకు, తమకన్నా పేదలుగా వున్నవారికి పెట్టుతూ వుంటారని కూడా చూశాం ఈ విషయాలలో కొంతవరకు వీరు వ్యవసాయ కార్మికులతోను, పేద రైతులతోను ఘర్షణ పడతారు. కానివీరు కూడా ప్రధానంగా భూస్వాములు, వడ్డీ వ్యాపారస్థులు, బడా పెట్టుబడి దారుల క్రింద భూస్వామ్య బడాబూర్జువా ప్రభుత్వ విధానాల, చట్టాల క్రింద అనేక బాధలకు దోపిడీలకు గురవుతున్నారు. కౌలుదోపిడి, అప్పుల దోపిడి పన్నుల బాధను గురవుతున్నారు. తమ వ్యవసాయానికి కావాల్సిన నీటి సౌకర్యాలు లేవు. ఎరువులు, పనిముట్లు మేలురకమయిన విత్తనాలు తేలికగా లభ్యం కావడం లేదు. దొంగ మార్కెట్టులో కొనుక్కోవలసి వస్తూ ఉంది. ఇవన్నీ ప్రధానంగా భూస్వాములు చేతుల్లోకి ఈ తర్వాత ధనిక రైతుల చేతుల్లోకి పోతున్నాయి.

అందుచేత ఈ సమస్యలన్నిటిమీద వీరి ఆందోళన పోరాటాలకు వ్యవసాయ కార్మిక, పేద రైతుల సహకారం, బలం అత్యవసరం. ఈ సమస్యలన్నిటి మీద వ్యవసాయ కార్మికులు, పేద రైతులు వారి సంఘాల చొరవ తీసుకొని మధ్యతరగతి రైతులను బలపర్చడానికి ముందుకు రావాలి. దానివలన వీరిని కూడా భూస్వామ్య దోపిడీకి, పెట్టుబడిదారీ దోపిడీకి వ్యతిరేకంగా తమతో కలుపుకొని రావడం తేలిక అవుతుంది.

వ్యవసాయ కార్మికులు పేదరైతులు ఆంధ్రదేశంలో మొత్తం జనాభాలో 70 శాతం వున్నారు. తమ జీవిత సమస్యలను పరిష్కరించుకోవాలంటే సోషలిస్టు సమాజ నిర్మాణానికి ప్రాతిపదికగా ప్రస్తుతమున్న భూస్వామ్య గుత్త పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని కూలద్రోసి జనతా ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ఏర్పరచుకోవడం తప్ప వారికి మరో మార్గమేమీలేదు. అలా జనతా ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పరచనిదే "దున్నేవానికే భూమి" నినాదాన్ని అమలులోకి తేవడం అసంభవం. ఇష్టంలేని ప్రభుత్వాన్నీ భూస్వాములను మెడలు వంచి కొంతవరకైనా బంజరు భూములను పంచి ఇచ్చేలాగా చేయడం. బలమైన శక్తివంతమైన సుశిక్షితమయిన వ్యవసాయ కార్మికులకు పేదరైతాంగానికి నేటి సమాజంలో కూడా సాధ్యమే. శక్తివంతమైన ప్రజాపోరాటాల ద్వారా కూలిరేట్లు పెంచుకోవటం, కౌలురేట్లు, వడ్డీ నామురేట్లు తగ్గించుకోవడం, తాము సాగుచేసుకొనే భూముల నుండి కౌలుదార్లు బేదఖలు కానీయకుండా చేయడం, గ్రామీణ పేదలకు ఉచితంగా ఇండ్లస్థలాలు సంపాదించడం కొన్ని పరిమితులలో సాధ్యమే, ఈ విధంగా పెట్టుబడిదారీ, జమిందారీ, భూస్వాములు దోపిళ్ళకు వ్యతిరేకంగాను, బేదఖళ్ళకు వ్యతిరేకంగాను, బంజరు భూములు పంపిణీ కోసం సాగే పోరాటాలు ఆ తర్వాత దశలో విప్లవాత్మకంగా భూమిని పునర్విభజింపచేయడానికి వీలుగా వ్యవసాయ విప్లవ విజయానికి దారితీస్తాయి.

ఈ వ్యవసాయ విప్లవాన్ని, జనతా ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతం చేయవలసిన అవసరం దానికి కావాల్సిన శక్తి, ఆ కర్తవ్యం వ్యవసాయ కార్మికుల, పేదరైతుల మీద ప్రధానంగా ఉంది. వానికోసం మధ్య తరగతి రైతులను ఖచ్చితంగా మొత్తంగా కలుపుకు రావాల్సిన బాధ్యత, ధనికరైతు వర్గాన్ని కూడా సాధ్యమైనంత వరకు కలుపుకురావాల్సిన బాధ్యత ప్రధానంగా వ్యవసాయ కార్మికుల పేదరైతుల మీద ఉంది. వారి సంఘాలమీద ఉంది. వారి నాయకత్వం మీద ఉంది.



# భూసంస్కరణల అమలు సమీక్ష-సిఫార్సులు

(1973లో భూసంస్కరణల చట్టం ప్యాసయిన తర్వాత 1983 వరకూ కాంగ్రెస్ పాలనలో, ఆతర్వాత తెలుగుదేశం పాలనలో సంస్కరణలు ఎలా, ఎంత వరకూ అమలు జరిగాయో, ఈ వ్యాసం వివరిస్తుంది- సం.)

ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణల అమలుపై చర్చించేందుకు 1992లో ఒక వర్క్‌షాప్ జరిగింది. ముస్సోరిలోని లాల్‌బహదూర్ శాస్త్రి నేషనల్ అకాడమి ఆఫ్ అడ్మినిస్ట్రేషన్ పిలుపుపై రాష్ట్రాల వారీగా జరిగిన వర్క్‌షాప్‌లలో భాగంగా జరిగిన ఈ కార్యక్రమానికి అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్. జనార్ధన్‌రెడ్డి, కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖమంత్రి జి.వెంకటస్వామి హాజరయ్యారు. ఈ వర్క్‌షాప్‌లో పాల్గొన్న ప్రముఖ విద్యావేత్తలు, ప్రభుత్వాధికారులు, కార్యకర్తలు-30 విశేష పత్రాలను సమర్పించారు. భూసంస్కరణల అమలులో అనేక లక్ష్యాలు అసంపూర్తిగా మిగిలిపోవడం వల్ల రాష్ట్ర రాజకీయ ఆర్థిక వ్యవస్థ, అభివృద్ధి తిరోగమనం పట్టిందని ఈ వర్క్‌షాప్ అభిప్రాయ పడింది. రాష్ట్రంలో భూసంస్కరణల అమలులో ఎదురవుతున్న అనేక సమస్యల్ని చర్చించి ఈ వర్క్‌షాప్ సిఫారసులు చేసింది.

**సాధారణ సమస్యలపై సిఫారసులు:**

వ్యవసాయ ఉత్పాదకతలో, దారిద్ర నిర్మూలనలో, జీవన ప్రమాణాల మెరుగుదలలో అభివృద్ధి సాధించాలంటే భూసంస్కరణలను తీవ్రంగా అమలు పరచక తప్పదు. అనేక సంవత్సరాలుగా అమలు జరుపుతున్న అనేక భూసంస్కరణల చట్టాలు, ప్రతికూల ఫలితాలనే ఇచ్చాయి. అప్పటిదాక మంచి స్థితిలో ఉన్న లబ్ధిదారులనే నష్టపరిచాయి. ఈ ధోరణిని తక్షణం నిలుపు చేయడమేకాక, రాష్ట్రంలో సరైన భూసంస్కరణలను రూపొందించే దాకా ఇలాంటి చర్యల్ని నిలుపు చెయ్యాలి. వర్క్‌షాప్ సిఫారసు చేసింది. ఈ వర్క్‌షాప్ జరిగేసమయానికి అందుబాటులో ఉన్న గణాంకాల ప్రకారం, అప్పటికి ఒక దశాబ్దకాలంగా భూగరిష్ట పరిమితి చట్టాలను, కౌలుదారుల రక్షణ చట్టాలను, గిరిజన భూముల పరిరక్షక చట్టాలను సమర్ధవంతంగా అమలు చెయ్యలేదని స్పష్టమయింది.

ఈ చట్టాలను సమర్ధవంతంగా అమలు పరచకపోవడానికి ఒక కారణం, ఈ చట్టాలను అమలు పరచవలసిన అధికారుల ప్రతికూల ధోరణి, భూసంస్కరణల అమలులో బెదిరింపులు, హెచ్చరికలు, దొంగకేసుల్లో ఇరికించి అరెస్టులు చేయించడం వంటి అనేక సంఘటనలు జరిగాయి. అందువల్ల, ఇలాంటి జోక్యాలను నివారించడానికి ప్రభుత్వం స్పష్టమైన మార్గదర్శక సూత్రాలను జారీ చెయ్యవలసిన అవసరం ఉంది.

రెవెన్యూశాఖ, భూసంస్కరణ ట్రిబ్యునళ్ళు అన్ని ప్రభుత్వశాఖలను పిలిచి, వారికి సంబంధించిన సమస్యలను చర్చించి భూసంస్కరణల లక్ష్యాలను, చట్టాలను గౌరవించాలని, ఆ చట్టాల స్ఫూర్తిని గ్రహించి వీటిని అమలు పరచవలసినదిగా స్పష్టమైన ఆదేశాలు జారీచేయాలి.

అనవసరమైన చట్టపర వివాదాలవల్లే భూసంస్కరణల చట్టాల అమలులో తీవ్ర జాప్యం జరుగుతుందని వర్క్‌షాప్ గుర్తించింది. అనేక సందర్భాలలో సమస్యల పరిష్కారాన్ని-కోర్టులకే వదిలిపెట్టడం (అది వారి అధికారపరిధిలో లేనప్పటికి) జరుగుతోంది.

వివిధ భూసంస్కరణల చట్టాలకు గల విలువను సుప్రీంకోర్టు నిర్ణయాలు అనేకం బలపరచాయి. అయినా అనేక కింది న్యాయస్థానాలు సుప్రీం నిర్ణయాలను విస్మరించి, తమ అధికార పరిధిలో లేని పిటిషన్లను కూడా చేపట్టిన సందర్భాలున్నాయి. అందువల్ల, సుప్రీంకోర్టు నిర్ణయాలన్నింటితో ఒక డైజెస్ట్‌ను తయారు చేసి, హైకోర్టులద్వారా కింది కోర్టులకు, ఇతర సంబంధిత శాఖలన్నింటికీ అందచేయాలి. ఇలాంటి డైజెస్ట్‌లను అర్ధ సంవత్సరానికి ఒకసారిగాని, సంవత్సరానికి ఒకసారిగాని ప్రచురిస్తూ ఉండాలి.

ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల చట్టాలకు అత్యవసరమైన సవరణలను చేపట్టడంలో జరుగుతున్న జాప్యం పట్ల వర్క్‌షాప్ ఆందోళన వ్యక్తం చేసింది. చట్టాలు కాలదోషం పట్టేలోపే సవరణలు, జరపాలని సుప్రీంకోర్టుకూడా కోరింది. భూసంస్కరణల ట్రిబ్యునళ్ళ బాధ్యతలను చేపట్టే అధికారుల ఎంపికలో జాగ్రత్త వహించాల్సిన అవసరాన్ని కూడా వర్క్‌షాప్ గుర్తించింది.

అదేవిధంగా, సంబంధిత ప్రభుత్వ న్యాయవాదులు కూడా భూసంస్కరణల కేసులను తగిన విధంగా ముందుకు తీసుకు వెళ్ళేలా చూడవలసిన అవసరం ఉంది.

సంబంధిత కేసుల సత్వర పరిష్కారానికి సహాయ పడేందుకు, సామాజిక ఒప్పందాలు, యూనియన్లు, స్వచ్ఛందసంస్థలు. న్యాయ సహాయకులు (ఎమికస్ క్యూరీలు) గా హాజరయ్యేందుకు అనుమతించాలి.

భూ సంస్కరణల ప్రమాణాలను అమలు పరచడంలో అధికార చర్యలకు తోడుగా పేదలు, లబ్ధిదారుల ప్రమేయాన్ని కల్పించే సంస్థాగత యంత్రాంగం లోపించింది.

అందువల్ల పరిశోధనలకు, విచారణలకు, నిజ నిర్ధారణలకు గ్రామస్థాయిలో లబ్ధిదారులతో కూడిన కమిటీలను ఏర్పాటుచేసి, సంబంధిత సంస్థలు అవసరాన్ని బట్టి వారితో సంప్రదించే ఏర్పాటు చేయాలి.

సమర్ధవంతంగా భూమిని వినియోగంలోకి తేవడానికి భూసంస్కరణలు ఎంతో ప్రభావం చూపుతాయి. శ్రామికశక్తి అధికంగా

గల ఆంధ్రప్రదేశ్‌లో, భూసంస్కరణల లబ్ధిదారులైన చిన్న రైతులే భూస్వాములకంటే మరింత ఉత్పాదకతతో, మరింత సమర్ధవంతంగా వ్యవహరించగలుగుతారు.

ప్రస్తుత చట్టాల ప్రకారం గ్రామాలకు చెందిన భూమి రికార్డు-ఆసక్తిగల సర్వే నెంబర్ల మేరకే వ్యక్తులకు అందుబాటులో ఉంటున్నాయి. భూసంస్కరణల నుంచి తప్పుకు పోయేవారి గురించిన సమాచారాన్ని పరిశోధించడంలో, ప్రభుత్వానికి సాయిపడుటలో స్వచ్ఛంద, సామాజిక కార్యకర్తలకు అవకాశం లభించడం లేదు. అందువల్ల బిఎస్‌ఒ 170 తదితర సంబంధిత పత్రాలన్నీ పబ్లిక్ డాక్యుమెంట్లుగా అందరికీ అందుబాటులో ఉంచాలి.

ప్రధానమైన భూమి రికార్డులను జిల్లాస్థాయిలో కంప్యూటరీకరించాలి. అందువల్ల సమాచారం అందరికీ అందుబాటులో ఉంటుంది.

**కౌలుదారు సంస్కరణలపై సిఫారసులు**

కౌలుదారుల ప్రయోజనాలకు, లబ్ధికి చేసిన చట్టాలు వారి వినాశనానికే దారితీశాయని వర్క్‌షాప్ అభిప్రాయ పడింది. దిగువ సూచనల ప్రకారం ప్రస్తుత చట్టాలకు సవరణలు చేపట్టాలని సిఫారసు చేసింది. 1. తెలంగాణాలో కౌలుదారుల ఏర్పాటుపై నిషేధాన్ని తొలగించాలి. 'వ్యక్తిగత సాగు' అంటే అర్థాన్ని భారతప్రభుత్వ మార్గదర్శక సూత్రాల ప్రకారం పునర్నిర్వచించాలి. రాత పూర్వక లీజ్ ఒప్పందాలను రిజిస్టర్ చేసినా-చేయకపోయినా-తప్పనిసరి చేసే చట్టంలోని సెక్షన్లకు సవరణలు చేయాలి. మౌఖిక, లాంఛన, తరుణ, వార్షిక మొదలైన అన్నిరకాల కౌలు ఒప్పందాలను వాటి వివిధ రూపాలతో సహా-అంటే పంటలో వాటా, స్థిరవాటా, స్థిర నగదు అద్దె మొదలైన ఏర్పాట్లను నమోదు చేసి రికార్డుల్లో ఉంచాలి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలంగాణాలో ప్రత్యేక కౌలు రికార్డులను నిర్వహించడం పట్ల అడంగల్ /పాణిపత్రాలలో కౌలుదారు/ వ్యవసాయదారు అనే వివరాలు నమోదు చేయడానికి కాలమ్‌లను ఏర్పాట్లు చేయడం పట్ల వర్క్‌షాప్ విచారం వ్యక్తం చేసింది. ఆంధ్ర, తెలంగాణా రెండు ప్రాంతాలలో కూడా కౌలుదారులను నమోదు చేయడానికి ప్రత్యేక రిజిస్టర్లను నిర్వహించాలని వర్క్‌షాప్ సిఫారసు చేసింది. కౌలుదారులను విడిగా నమోదు చేయడానికి, అడంగల్ / పాణిపత్రాలలోని కాలమ్‌లను రిజిస్ట్రేషన్ చేయాలని వర్క్‌షాప్ కోరింది.

పశ్చిమబెంగాల్‌లో "ఆపరేషన్ బర్గా" తరహాలోనే ఇక్కడ కూడా కౌలుదారులను నమోదు చేసే ఉద్యమాన్ని చేపట్టాలని వర్క్‌షాప్ కోరింది. కౌలుదారులు మొత్తం వ్యవసాయ భూమిలో 30 శాతంగా ఉన్నందున, వారిని లెక్కల్లోకి తెచ్చేందుకు గాను ఈ ఉద్యమాన్ని నిర్ణీత కాల వ్యవధిలో పూర్తిచేయగలని వర్క్‌షాప్ కోరింది.

పైన పేర్కొన్న విధంగా కౌలుదారులను నమోదు చేయడంలో ప్రభుత్వానికి సహాయపడేందుకు గాను వివిధ అసోసియేషన్లు, ఏజన్సీలు, యూనియన్లతో కూడిన గ్రామ కమిటీలను ఏర్పాటు చేయాలి. స్థానికంగా నివాసం ఉంటున్న భూస్వాముల, నివాసం ఉండని భూస్వాములకు చెందిన కౌలుదారుల మధ్య విభజన ఉండవలసిన అవసరం వుంది. నివాసం వుండని భూస్వాములకు చెందిన కౌలుదార్లే చివరికి ఆ భూమి యజమానులు అవుతారు. కాని నివాసం ఉంటున్న భూస్వాముల విషయంలో అలా కాదు, అందువల్ల భూస్వామి నివాసప్రాంతం, చిరునామా, కాలం నమోదు చేసేందుకు తగిన ఏర్పాటు ఉంచాలి. చిన్న, పేద కౌలుదార్ల ముఖ్యంగా బలహీనవర్గాలకు చెందిన వారి ప్రయోజనాల పరిరక్షణకు తగిన ఏర్పాట్లు ఉండాలి. మత, సేవా సంస్థలకు చెందిన భూములను కేవలం భూమి లేని పేదలు, పేద, చిన్న రైతులకు మాత్రమే కౌలుకు ఇవ్వాలి.

1.7.1980 నుంచి అమలు కావలసిన కౌలుదారు చట్టాలను అమలు చేయడం నుంచి ఆంధ్రప్రాంత రెవెన్యూ శాఖను మినహాయించారు. వాటిని ఖచ్చితంగా అమలు చేసే అధికారాన్ని రెవెన్యూ శాఖకు ఇవ్వాలి. రాష్ట్రం మొత్తానికి ఒక్కటే కౌలుదారు చట్టం ఉండాలి.

రక్షిత కౌలుదారులను కూడా తొలగిస్తున్న ఉదంతాలను, తెలంగాణా చట్ట విరుద్ధంగా కౌలుదార్లను తొలగిస్తున్న సమాచారాన్ని వర్క్‌షాప్‌లు సభ్యులు గుర్తించారు. ఇలాంటి తొలగింపులను నిలుపుదల చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం పటిష్టమైన చర్యలు తీసుకోవాలి. ఇప్పటికే తొలగింపు జరిగిన వారికి భూమి అప్పగించాలి.

**పరిమితి చట్టాలు అమలుపై సిఫారసులు**

ప్రస్తుతం అమలులో ఉన్న పరిమితి చట్టాలను రానున్న రెండేళ్ళలో ఖచ్చితంగా అమలు పరచాలి. కనీస వేతనాల చట్టాన్ని కూడా ఇందులో భాగంగా అమలు పరచాలి. మిగులు భూమిగా గుర్తించిన భూమిలో 50 శాతాన్ని కోర్టు వివాదాలలో పోగొట్టు కోవడం జరిగింది. అందువల్ల భూమి పోయిన అన్ని కేసులను సమగ్రంగా సమీక్షించి, సరైన కారణాలు లేని కేసుల్లో, భూమిని తిరిగి పొందేందుకు చర్యలు చేపట్టాలి.

ఇలాంటి లిటిగేషన్లలో దాదాపు 2 లక్షల ఎకరాలదాకా భూమి చిక్కుకుపోయింది. వీటికోసం తగినన్ని ట్రిబ్యునళ్ళు, అప్పిలేట్ ట్రిబ్యునళ్ళను ఏర్పాటు చేయడంతో బాటు, రాజ్యాంగంలోని 323 ఆర్టికల్ ప్రకారం ప్రత్యేక కోర్టును నెలకొల్పాలి. అస్రపుద్దీన్ కేసులో సుప్రీంకోర్టు తీర్పుకు ప్రభావం కల్పించేలా 1973, ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల (సిఎవిహెచ్) చట్టానికి సవరణ తేవాలి.

హైకోర్టు తీర్పు మునుగులో భూస్వాములు విపరీత ప్రయోజనాలు పొందిన సందర్భంలో భూమి యాజమాన్యం గురించి

ప్రభుత్వం తక్షణ చర్యలు చేపట్టాలి. మేజర్ కుమారులకు వాటా కల్పించరాదని వర్క్‌షాప్ భావించింది. మేజర్ కుమారులకు వాటా కల్పించిన అన్ని కేసులను - అందులో న్యాయాన్ని పరిశీలన నిమిత్తం ప్రభుత్వం సమీక్షించాలి. అలాగే మేజర్ కుమారులకు వాటా కల్పించే వెసులుబాటును రద్దుచేస్తూ సవరణ తేవాలి. చట్టాన్ని ఆసరా చేసుకొని భూస్వాములు విగులు భూములను భుక్తం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నారు. ఒక భూయజమాని అప్పీలు చేసుకునే దశలోనే తన కేసును కోల్పోతే, రివిజన్ చేపట్టడానికి ముందు తన భూమిని ప్రభుత్వానికి అప్పగించాలి. ప్రస్తుతం సుప్రీంకోర్టు హైకోర్టుల ముందున్న వాజ్యాలకు కూడా ఈ పద్ధతిని అమలు చేయాలి. ఈ మేరకు చట్ట సవరణను వెంటనే చేపట్టాలి. ఒకవేళ భూమి యజమానులు కేసు గెలుచుకుంటే, ఆ భూమిని భూసేకరణ చట్ట ప్రకారం ప్రభుత్వం స్వాధీనం చేసుకొంటే, భూయజమానికి పరిహారం కోరుకొనే అవకాశం కల్పించాలి.

మిగులు భూముల డిక్లరేషన్లను, మిగులు భూముల వివరాలతో సహా గ్రామాలలో ప్రకటించాలి. అవి స్వచ్ఛందసంస్థల పరిశీలనకు అందుబాటులో ఉంచాలి. పరిమితి హద్దులను తగ్గించాలనే ఒక బలమైన కేసు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నదని వర్క్‌షాప్ భావించింది. ఈ సందర్భంలో ఆ భూయజమానులు తమ జీవనోపాధి కోసం ఆ భూమిపైనే ఆధారపడ్డారా, వారు స్థానికులా, కాదా అనే అంశాలకు ప్రాధాన్యత ఇవ్వాలి. చట్టం అమలులోకి వచ్చాక తగినంత భూమి ప్రజల సాగులోకి వచ్చింది. అందువల్ల వెంటనే పునర్ కంప్యూటరీకరణ చేపట్టాలి. భూపరిమితి కేసుల్లో సివిల్‌కోర్టుల జోక్యాన్ని నివారించే సవరణ తీసుకురావాలి. భారీ ఎత్తున వ్యవసాయంలో భూముల్ని పరిశ్రమలకోసం కొనుగోలు చేయడాన్ని నివారించాలి.

బలహీన వర్గాల వారికి ప్రభుత్వ భూములను కేటాయించాలి. వారికి సమిష్టి ఆస్థి వనరులు అందుబాటులోకి వచ్చేలా చూడాలి.

గిరిజన, అటవీ భూముల విషయంలో, వాటిని సాగుచేసుకొంటున్న గిరిజనులకు తగిన చట్టపరమైన అధికారాలు కల్పించాలి. టైటిల్ డీడ్స్ ద్వారా ఆ హక్కుల్ని ధృవీకరించాలి.

సహజవనరులైన భూమి, నీరు, గనులు, అడవులపై గిరిజనులకు సంప్రదాయంగా కొనసాగుతున్న హక్కులను గుర్తించాలి. ఈ విషయంలో కోర్టులను ఆశ్రయించేందుకు అవసరమైతే గిరిజనులకు ధనసహాయం కూడా అందించాలని వర్క్‌షాప్ సిఫారసు చేసింది. నీటి ప్రాజెక్టుల నిర్మాణం కోసం గిరిజన భూముల్ని ప్రభుత్వం సేకరిస్తే, వాటికి పరిహారంగా ప్రాజెక్టు ఆయకట్ట పరిధిలో భూమిని కేటాయించాలి.

భూసంస్కరణల అమలులో గ్రామీణ పేదలకు చెందిన స్వచ్ఛంద, ప్రభుత్వేతర సంస్థల పాత్రను ధృవీకరించాలి. వివిధ శాసన కమిటీలలో ప్రజలకు ప్రాతినిధ్యం వహించే అవకాశాన్ని ఆ సంస్థలకు కల్పించాలి.



# భూమి సర్వే విశ్లేషణ నివేదిక

ఆంధ్రప్రదేశ్‌వ్యవసాయ కార్మికసంఘం

రాష్ట్రంలో సాగుభూములు, సాగుకు ఉపయోగపడే భూములు, ఇళ్ళ స్థలాలు, కౌలు సమస్యలపై ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం రాష్ట్రవ్యాప్త సర్వే నిర్వహించింది. 670 దళాలు, 2680 మంది సభ్యులు 10 రోజులపాటు ఈ సర్వేలో పాల్గొన్నారు. సర్వేపత్రం ఆధారంగా ప్రతి యింటికి తిరిగి సమాచారాన్ని సేకరించారు.

200 మండలాల్లో 255 గ్రామాల్లో జరిగిన సర్వే విశ్లేషణలు అనేక ఆసక్తికరమైన అంశాలను వెలుగులోకి తెచ్చాయి. 57 సం။ల స్వాతంత్ర్యానంతరం సొంతభూమి లేని గ్రామీణపేదలు 60%వున్నారు. 1990 నుండి ప్రత్యేకించి ప్రపంచబ్యాంకు విధానాలు ముందుకొచ్చినప్పటి నుండి భూసమస్యను పూర్తిగా పాలకులు పక్కనపెట్టారు. చంద్రబాబు నాయుడు వ్యవసాయ కార్మికులను గాలికి వదిలారు. ఆర్థిక వనరులు పేదలకు సమకూర్చకుండా ఆర్భాటాలకు నిధులు వెచ్చించారు. ఫలితంగా పేదరికం పెరిగింది. పనులు లేవు. వలసలు అధికమయ్యాయి. అధికారులు తీవ్రనిర్లక్ష్యం వహించారు. నూతన ప్రభుత్వం భూసమస్యలపై ఇస్తున్న హామీలు, చేస్తున్న ప్రకటనలు పేదల్లో ఆశలు పెంచుతున్నాయి.

సర్వే సమాచారాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రి , సంబంధిత మంత్రులకు, అధికారులకు , రాజకీయ పార్టీల నాయకులకు అందజేస్తాం. ప్రభుత్వం సానుకూలంగా స్పందించి భూ సమస్యను పరిష్కరించాలి. అందుకు తగిన సమయం ఇస్తాం. ప్రభుత్వ వైఖరినిబట్టి కార్యాచరణ చేపట్టేందుకు కూడా పేదలను సంసిద్ధం చేయాలని వ్యవసాయ కార్మిక సంఘం నిర్ణయించింది.

**సాగుభూమి :**

84,430 కుటుంబాలను సర్వేచేయగా ఇందులో 38,069 కుటుంబాలకు అంటే 45% కుటుంబాలకు సాగుభూమి ఉంది. 46362 కుటుంబాలకు 55%వారికి సొంతభూమి లేదు. సాగుభూమి కలిగినవారిలో 8,208 కుటుంబాలకు 21.5% మందికి పట్టాదారు పాసుపుస్తకాలు లేవు. సాగు చేసుకుంటున్న పేదలకు పట్టాలివ్వడంలో గతప్రభుత్వాలు ఎంతటి బాధ్యతారహితంగా వ్యవహరించాయో విదితమవుతుంది. ఒకే భూమికి 1325 కుటుంబాలకు ప్రభుత్వం పట్టాలిచ్చి, భూమి ఎవరికి స్వాధీనపర్చకుండా పేదలమధ్య ఘర్షణలను సృష్టిస్తున్నారు.

పంపిణీ చేయడానికి భూమి ఇంక్కెక్కడుందనే వాదన బలంగావుంది. కానీ మాసర్వేలో పేద ప్రజలకు పంచడానికి కావాల్సినంత భూమి అందుబాటులో వుందని తేలింది. 38 రకాలభూములు, 29,068 ఎకరాలు పేదలకు ఇవ్వడానికి అనుకూలంగా వున్నాయని గుర్తించడ్డాయి. కాబట్టి భూమి కావాల్సినవారికి ఇవ్వడానికి కావాల్సినంత భూమి అందుబాటులో వుంది. కావాల్సిందల్లా ఆ భూములు పేదలకు ఇవ్వాలన్న చిత్తశుద్ధి.

**ఇళ్ళస్థలాలు:**

84,430 కుటుంబాలను ఇళ్ళ స్థలాలపై సర్వేలు చేయగా 51,720 కుటుంబాలకు 61.26 శాతం వారికి ఇళ్ళస్థలాలున్నాయి.

32,710 కుటుంబాలకు 38.74శాతం వారికి ఇంటి స్థలాలు లేవు. ఇంటిస్థలాలు వున్నవారిలో 12,749 కుటుంబాలకు (24.65%) పట్టాలులేవు. పట్టాలిచ్చి 2,079 కుటుంబాలకు స్థలాలు చూపించలేదు. ఇళ్ళస్థలాల పంపిణీ ఇంతకాలం కాగితాలమీదనే జరిగింది.

కౌలు :

6,512 కుటుంబాలు కౌలుకు భూములు సాగుచేస్తున్నారు. 3,626 కుటుంబాలు భూములు కౌలుకు యిస్తున్నారు. ఒక పంటకు పది బస్తాల నుండి ఇరవై బస్తాలవరకు కౌలువుంది. డబ్బురూపంలో అయితే రూ.3,000/- నుండి రూ.7,000/ వరకు అమలవుతుంది. కౌలుదారులకు బ్యాంకు రుణాలు ఇవ్వడంలేదు. భూయజమానులు బ్యాంకునుండి రుణాలు తెచ్చి కౌలుదారులకు రూ.2/- నుండి రూ.4/-ల వరకు వడ్డీకి యిస్తున్నారు. పంటనష్టాలకు ప్రభుత్వం యిచ్చే పరిహారంకూడా కౌలుదారులకు చెందడంలేదు.

వ్యవసాయ కార్మిక సంఘం చేసిన సర్వే ఆధారంగా ప్రభుత్వం ఈ క్రింది భూసమస్యలను పరిష్కరించాలి.

1. ప్రభుత్వ భూములను సాగుచేసుకుంటున్న పేదలకు పట్టాలివ్వాలి.
2. ప్రభుత్వ భూములు ఆక్రమించుకున్న ధనవంతులను తొలగించి పేదలకు ఇవ్వాలి.
3. అన్నిరకాల ప్రభుత్వభూములు, దేవాలయ భూములు పేదలకే పంపిణీచేయాలి.
4. పట్టాలిచ్చి పొజిషన్ చూపించని వారికి వెంటనే భూములు చూపాలి. అందరికీ ఆర్.ఓ.ఆర్.లు ఇవ్వాలి.
5. వెలుగు నిధులతో భూములు కొనివ్వాలి. నీటిసౌకర్యం లాంటి భూ అభివృద్ధి చర్యలను ప్రభుత్వం చేపట్టాలి.
6. డిఫారం పట్టా భూములను పేదలు కొంటే వారిపేరుతో పట్టామార్చాలి. ధనవంతులు కొనుగోలు చేస్తే వాటిని రద్దుచేసి పేదలకు ఇవ్వాలి.
7. ప్రభుత్వం, ప్రైవేటు స్థలాల్లో ఇళ్ళేనుకున్న పేదలకు పట్టాలివ్వాలి. పట్టాలిచ్చిన వారికి స్థలం చూపాలి. అత్యవసర భూసేకరణ ద్వారా ఇళ్లస్థలాలకు భూసేకరణ చేయాలి. ప్రభుత్వమే స్థలాలను చదును చేయాలి.
8. అర్హులైన పేదలకు పక్కాగృహం ఇవ్వాలి. నిర్మాణ వ్యయం రూ.36వేలకు పెంచి రూ. 30వేలు సబ్సిడీ ఇవ్వాలి.
9. భూములు రీ- క్లాసిఫికేషన్ చేయాలి. భూ సీలింగ్ పరిమితి తగ్గించాలి. కోర్టుల్లో ఉన్న భూ కేసులను సత్వరం పరిష్కరించాలి. భూ సమస్యలపై హైకోర్టు ప్రత్యేక బెంచ్ ఏర్పాటుచేయాలి.
10. తెల్లకాగితాలపై అమ్మకాలు, కొనుగోళ్ళు చెల్లవని సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును అమలుజరిపి తిరిగి సర్వేచేయాలి.
12. ఫారెస్టు యాక్ట్ సెక్షన్ 4 ప్రకారం సేద్యం చేసుకునే పేదలకు పట్టాలివ్వాలి. డిఫారెస్టు ల్యాండు పేదలకు ఇవ్వాలి.
13. కౌలుదారులకు గుర్తింపుకార్డులు, ఋణసౌకర్యం కల్పించాలి.
14. కాలువగట్టుపై వున్న కొబ్బరిచెట్టు పేదలకే లీజుకు ఇవ్వాలి. గట్లపై గుడిసెలు వేసుకున్న పేదలను తొలగించవద్దు.
15. ఎస్సీ కార్పొరేషన్ కొనుగోలు చేసిన భూములు పేదలకు స్వాధీనం చేయాలి. ప్రభుత్వమే పూర్తి డబ్బులు చెల్లించాలి.
16. చెరువులు, రిజర్వాయర్లు లోతట్టు ( శికం) భూముల్లో పంటలు వేసుకునే అవకాశం పేదలకే ఇవ్వాలి.

## ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం - గ్రామ సర్వే విశ్లేషణ:

### సాగు భూమి సర్వే వివరాలు

| | సర్వేచేసిన | | భూమి | | భూమివుండి పట్టాలేని వివరాలు | | | | | పేదలకు ఇవ్వడానికి గుర్తించిన భూములు | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జిల్లా | గ్రామాలు | కుటుంబాలు | ఉన్నవారు | లేనివారు | కుటుంబాలు | స్వభావం | ఎకరాలు | మొత్తం | ఒకేభూమికి ఇరువురికి పట్టాలు | స్వభావం | ఎకరాలు |
| కర్నూలు | 65 | 16826 | 7796 | 9030 | 805 | ప్రభుత్వబంజరు | | | | సీలింగుభూములు | 600 |
| | | | | | 140 | శివాయిజమ | 750 | | | ఫారమ్‌భూములు | 1000 |
| | | | | | 45 | కెసికెనాల్ | 304 | | | స్వాతంత్ర్య సమర | 100 |
| | | | | | 130 | పోరంబోకు | 260 | | | దేవాలయ భూములు | 2100 |
| | | | | | | ఎల్ఎల్‌సి, కొండ | | | | చెరువు లోతట్టు | 546 |
| | | | | | | | | | | ఫారెస్టు | 2500 |
| | | | | | | | | | | ఇనాం భూములు | 1000 |
| | | | | | | | | | | కెనాల్ | 400 |
| | | | | | | | | | | మేదరి పోడు | 18 |
| | | | | | 135 | పోరంబోకు | 230 | | | | |
| | | | | | 500 | తంగడంచఫారం | 550 | | | | |
| | | | | | 600 | కుంటలు, చెరువు | 854 | | | | |
| | | | | | 100 | శోత్రియం, జాగీర్ | 225 | 3023 | 61 | దేవాలయ | 1050 |
| ఖమ్మం | 43 | 11737 | 5851 | 5886 | 1917 | పోరంబోకు | 250 | | 2 | సీలింగు | |
| | 30 | | | | | | | | | | |
| | | | | | | సీలింగు | 60 | | | ప్రభుత్వం | 457 |
| | | | | | | గ్రామసముదాయం | 170 | | | సాగర్ భూమి | 129 |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | ఫారెస్టు ఎక్స్‌ప్రెన్ | 72 | | | | |
| | | | | | | | | | | ఘాట్‌నెంబరు | 3,374 |
| | | | | | | ఇనాం | 60 | | 209 | ఫారెస్టు | 190 |
| | | | | | | ప్రభుత్వభూమి | 518 | 1130 | | భారస్‌ఖాతా | 188 |
| | | | | | | | | | | గ్రామకంఠం | 360 |
| | | | | | | | | | | సమిష్టిభూమి | 13 |
| | | | | | | | | | 27 | ఇనాము | 6 |
| గుంటూరు | 12 | 8504 | 3477 | 5027 | 128 | పోరంబోకు | 59 | | 1 | | |
| | | | | | | చెరువు | 70 | 129 | | బంజరువాగు | 100 |
| | | | | | | | | | | పడావు | 100 |
| | | | | | | | | | 10 | దేవునిమాన్యం | 32 |
| శ్రీకాకుళం | 6 | 1,358 | 925 | 433 | 240 | లీజు | 225 | | | | |
| | | | | | | పోరంబోకు | 455 | 917 | 141 | | 4 |
| | | | | | | సీలింగు | 210 | | | భూ.లీజుభూమి | 50 |
| | | | | | | మొ.కా.స.భూమి | 27 | | | పోరంబోకు | 100 |
| | | | | | | | | | | బంజరు | 125 |
| | | | | | | | | | | గ్రామకంఠం | 6 |
| | | | | | | | | | | అనర్హుల | 15 |
| | | | | | | | | | | సముద్రతీర | 150 |
| | | | | | | | | | | ప్రభుత్వభూ | 250 |
| అనంతపురం | 14 | 2,090 | 1,466 | 624 | 456 | | | | 9 | దేవాలయ | 180 |
| | | | | | | | | | | అ.బంజరు | 1117 |
| | | | | | | | | | | పీర్లమాన్యం | 6 |
| | | | | | | | | | | గుట్టపోరం | 55 |
| | | | | | | | | | | తోపుపోరం | 38 |
| | | | | | | | | | | వక్ఫ్‌భూమి | 11 |
| | | | | | | | | | | జైలుభూమి | 1000 |
| | | | | | | | | | | ఇనాం, మఠం | 31 |
| | | | | | | | | | | చెరువుభూమి | 75 |
| మెదక్ | 7 | 1,651 | 1,050 | 601 | 58 | పోరంబోకు | 3 | 3 | 43 | సికం | 28 |
| | | | | | | | | | | దేవాలయం | 12 |
| | | | | | | | | | | ప్రభుత్వ, గైరాన్ | 683 |
| ప్రకాశం | 16 | 4,711 | 2,182 | 2,529 | 243 | | | | | ఏటి,తొట్టిపోరం | 73 |
| | | | | | | | | | | రాజాభూమి | 109 |
| | | | | | | | | | | దేవాదాయ | 31 |
| | | | | | | | | | | వాగుబంజరు | 72 |
| | | | | | | | | | | అసైన్‌మంట్ | 200 |
| | | | | | | | | | | పోరం, విత్తనాభి | 540 |
| | | | | | | | | | | గ్రామకంఠ,ఎస్సీ.కా | 30 |
| చిత్తూరు | 7 | 1,742 | 910 | 832 | 84 | | | | | అనా,పోరం | 1007 |
| | | | | | | | | | | ప్రభుత్వ | 500 |
| | | | | | | | | | | సొసైటీ | 300 |
| | | | | | | | | | | అటవీబంజరు | 1000 |
| ప॥గో | 11 | 6517 | 1451 | 5066 | 7 | బంజరు | 10 | | | బం.పోరం.పుంత | 26 |
| ఆదిలాబాద్ | 7 | 1,237 | 476 | 761 | 205 | ఫారెస్టు | 800 | 800 | 18 | ఫారెస్టు | 100 |
| | | | | | | | | | | లావునిపట్టా | 377 |
| | | | | | | | | | | సీలింగు | 100 |
| | | | | | | | | | | సిఫాయి,ఇనాం | 121 |
| | | | | | | | | | | సికం | 46 |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కరీంనగర్ | 2 | 792 | 504 | 288 | | | | | | |
| మ॥నగర్ | 14 | 3702 | 2203 | 1499 | 120 | భూదాన,పోరంబోకు | 116+4 | 120 | | సీలింగ్300,భూదాన300 | |
| | | | | | | | | | | దేవాలయ 554 | 1154 |
| విజయనగరం | 2 | 714 | 288 | 426 | 136 | దేవా,ప్రభు,సేవా, పో | 500+325 | 825 | | | |
| తూ॥గో | 3 | 1618 | 293 | 1325 | 80 | భూదాన,ప్ర.భూమి | 34 | 34 | | దేవాదాయ,లీజు 123 | |
| రంగారెడ్డి | 3 | 1,101 | 654 | 447 | 124 | జాగిర్దారి | 308 | | | ఫారెస్టు | 900 |
| | | | | | | పోరంబోకు | 80 | 388 | | | |
| నల్గొండ | 10 | 3921 | 1513 | 2408 | 443 | ప్రభుత్వభూమి | 120 | 120 | | చెరువుసికిం | 92 |
| కడప | 1 | 761 | 283 | 478 | 72 | భూకోనుగోలు | 108 | 108 | | ఎస్సీ,కార్పొ | 800 |
| | | | | | | | | | | సికిం 46 | |
| | | | | | | | | | | గ్రామకంఠం | 6 |
| | | | | | | | | | | అనర్హుల | 15 |
| | | | | | | | | | | సముద్రతీర | 150 |
| | | | | | | | | | | ప్రభుత్వభూ | 250 |
| విశాఖపట్నం | 14 | 4798 | 1319 | 3479 | 530 | ఫారెస్టు | 166 | | | | |
| | | | | | | జంజరు | 568 | 734 | 400 | ప్రభుత్వబంజరు | 1000 |
| వరంగల్ | 10 | 6,445 | 2,946 | 3499 | 350 | | 20 | 20 | | సీలింగ్+ప్రభుత్వ | 732 |
| కృష్ణా | 8 | 4,206 | 2,482 | 1724 | 939 | ప్రభుత్వలంక | | | | | 939 |
| మొత్తం | 255 | 84431 | 38069 | 46362 | 8208 | | 8781 | 9231 | 1325 | | 29068 |



# రాష్ట్రంలో పేదలకు భూపంపకం-హరితాంధ్రప్రదేశ్ నిర్మాణం

- కొల్లి నాగేశ్వరరావు
కన్వీనర్, భూసమస్య పరిష్కారానికి
నిర్దిష్ట చర్యలపై కమిటీ
సి.పి.ఐ., ఆంధ్రప్రదేశ్ సమితి.

2001 జనాభా లెక్కలననుసరించి ఆంధ్రప్రదేశ్ జనాభా 761.11 లక్షలు. వీరిలో గ్రామీణ జనాభా 552.97 లక్షలు. మొత్తం జనాభాలో 72.65 శాతం. వీరిలో భూమిలేని వ్యవసాయ కార్మికులు 217.22 లక్షలు. గ్రామీణ జనాభాలో 39.28 శాతం. వీరిలో 87 లక్షలు ఎస్.సి.లు మరియు 38 లక్షలు ఎస్.టిలు వున్నారు. 1.13 లక్షలకు గృహ వసతి లేదు. 25 శాతానికి ఎండవానల నుండి రక్షణ ఇచ్చు ఇళ్ళు లేవు. 2001 ప్రారంభంలో రాష్ట్రంలో 31.45 లక్షలు రిజిష్టర్డు నిరుద్యోగులు వుంటే, 14681 ఉద్యోగ ఖాళీలు వున్నవి. సంవత్సరం ఆఖరుకు నిరుద్యోగుల సంఖ్య తగ్గకపోగా కొత్త వారితో కలిపి 31.58 లక్షలకు పెరిగింది. అనగా 0.4 శాతం మాత్రమే ఉద్యోగవసతి కలిగింది. 250 నిరుద్యోగులలకు ఒక ఉద్యోగం లభించింది. కంప్యూటర్ యుగంలో ఉద్యోగ సౌలభ్యం ఇంత అధ్వాన్నంగా ఉన్న పరిస్థితులలో గ్రామీణ పేదలకు ఉపాధి వ్యవసాయంలోనే సాధ్యం. వ్యవసాయానికి మౌలిక అవసరం భూమి, నీరు. ఈ మధ్య పేదలకు భూవసతి కలుగచేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. అలాగే రాష్ట్ర సమగ్ర ఇరిగేషన్ అభివృద్ధికి అవసరమైన ఇరిగేషన్ ప్రాజెక్టులు నిర్మించడానికి కూడా పథకం ప్రకటించింది. పేద ప్రజలకు భూమి, సాగునీరు లభిస్తే రాష్ట్ర అభివృద్ధి సాధ్యం. ఉపాధి పెరుగుతుంది. గ్రామీణ ప్రజల ఆదాయాలు పెరుగుతాయి. పట్టణాలలో వ్యాపారాలు, పరిశ్రమలు పెరుగుతాయి. గ్రామీణ ప్రజలకు భూవసతి పెరిగితే ప్రత్యక్షంగా గ్రామీణ ఉపాధి సమస్య చాలా భాగం పరిష్కరించబడుతుంది. పరోక్షంగా పట్టణ నిరుద్యోగ సమస్య పరిష్కారానికి కూడా తోడ్పడుతుంది. అంతేకాక పేద వ్యవసాయ కార్మికులలో విద్యావిజ్ఞానాలు పెరుగుతాయి. సామాజిక గౌరవం పెరుగుతుంది. వ్యత్యాసాలు తగ్గుతాయి. సామాజిక న్యాయం సాధ్యపడుతుంది.

**భూసంస్కరణల చట్టం**

రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి మౌలికమైన పేదలకు భూపంపకం కోసం భారత కమ్యూనిస్టు పార్టీ, వ్యవసాయ కార్మిక సంఘం, ఇతర వామపక్ష ప్రజాతంత్ర శక్తులు నిర్వహించిన పోరాటాల ఫలితంగా 1973లో భూసంస్కరణల చట్టం చెయ్యబడింది. ఈ చట్టాన్ననుసరించి భూస్వాములవద్ద 16.63 లక్షల ఎకరాలు మిగులు భూమి వున్నదని ప్రభుత్వం గుర్తించింది. దీనిలో ప్రభుత్వం 8.47 లక్షల ఎకరాలు స్వాధీనం చేసుకొని 5.71 లక్షల ఎకరాలు, 5.11

లక్షల లబ్ధిదారులకు పంచింది. ఈ పంపకం నాటికి కోర్టు లిటిగేషన్‌లో వున్న 8.62 ఎకరాలలో 31-3-2002 నాటికి 44.52 వేల భూస్వాములవద్ద 7.96 లక్షల మిగులు భూమి వున్నట్లు సమీక్షించి 6.45 లక్షల ఎకరాలు ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్నది. అయినా 1.31 లక్షల ఎకరాలు కోర్టు లిటిగేషన్లలో వున్నది.

భూసంస్కరణల చట్టం ద్వారా తేలిన మిగులు భూములతోపాటు బంజరుభూములు వగైరా 1-11-69 నుండి 31-3-2001 వరకు ప్రభుత్వం 29.2 లక్షలమంది లబ్ధిదారులకు 42.45 లక్షల ఎకరాలు పంచినట్లు ఈ మధ్య రాష్ట్ర ప్రభుత్వం రూరల్ డిపార్టుమెంటు ప్రకటించింది.

క్రింద చార్టులో ప్రకటించినవేకాక ప్రభుత్వం వివిధ రూపాలలో మొత్తం 66.68 లక్షల ఎకరాలు 33.99 లక్షల లబ్ధిదార్లకు పంచినట్లు ప్రకటించింది. పంపకాలు 5.71 లక్షలు యస్.సి.లబ్ధిదారులకు 9.79 లక్షల ఎకరాలు, 6.67 లక్షలు యస్.టి.లకు 11.83 లక్షల ఎకరాలు, బి.సి.లు 5.18 లక్షలకు 10.92 లక్షల ఎకరాలు, ఇతరులు 7.12 లక్షలకు 12.02 లక్షల ఎకరాలు పంచినట్లు ప్రకటించారు.

ఇలా పంచిన భూములలో భూసంస్కరణల చట్టాన్ననుసరించి 5.77 లక్షల ఎకరాలు మిగులు భూములతోపాటు భూదాన భూములు 1.12 లక్షల ఎకరాలు కూడా వున్నవి. అలాగే 1956 ఐ.ఎ. యాక్టు కింద కోస్తాంధ్ర, రాయలసీమ 13 జిల్లాల్లో పంచిన 3.16 లక్షల ఎకరాలు, 1955 టి.ఎ. యాక్టు ప్రకారం తెలంగాణా జిల్లాలలో పంచిన 3.51 లక్షల ఎకరాలు, ఈనాం రద్దు చట్టాన్ననుసరించి తెలంగాణా జిల్లాలలో పంచిన 2.37 లక్షల ఎకరాలు, భూమి కొనుగోలు పథకం క్రింద 1982.83 నుండి 2001-02 వరకు పంచిన 50 వేల ఎకరాలు, టెనెన్సీ యాక్టు కింద తెలంగాణా జిల్లాలలో పంచిన 6.98 లక్షల ఎకరాలు వున్నవి.

## రాష్ట్రంలో భూ పంపకం -మిగులు భూముల పరిస్థితి

| | 1-11-69 నుండి3 1-3-2001వరకు ప్రభుత్వం పంచిన అన్నరకాల భూములు | | అనంతరం 31-3-2002 వరకు మిగులు భూముల పరిస్థితి | | | |
|---|---|---|---|---|---|---|
| జిల్లాపేరు | లబ్ధిదారులు | పంచిన భూములు | మిగులుభూములు ప్రకటించిన భూస్వాములసంఖ్య | ప్రకటించిన మిగులు భూములు | ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్నవి | కోర్టు పరిశీలలో ఉన్నవి |
| శ్రీకాలకుళం | 84041 | 69124.72 | 9136 | 9910.68 | 8307.98 | 1602.70 |
| విజయనగరం | 81050 | 98600.83 | 7155 | 11239.66 | 8268.03 | 2971.63 |
| విశాఖపట్నం | 105679 | 151297.56 | 6801 | 12309.58 | 11095.38 | 1107.10 |
| తూర్పుగోదావరి | 67267 | 54968.17 | 21536 | 34347.69 | 15499.82 | 18847.87 |
| పశ్చిమగోదావరి | 63026 | 81953.23 | 23931 | 13821.00 | 8547.00 | 4770.00 |
| కృష్ణా | 84397 | 86967.11 | 24229 | 22379.90 | 16393.64 | 5986.26 |
| గుంటూరు | 92524 | 70813.65 | 23879 | 9418.78 | 7791.04 | 878.87 |
| ప్రకాశం | 198560 | 309147.56 | 19279 | 17957.06 | 16309.66 | 1647.40 |
| నెల్లూరు | 253616 | 408131.06 | 16044 | 64988.89 | 63385.97 | 1602.92 |
| చిత్తూరు | 280787 | 387693.96 | 10467 | 16265.28 | 11193.53 | 4455.37 |
| కడప | 120430 | 221367.66 | 10355 | 11612.11 | 10169.37 | 1442.74 |
| అనంతపూర్ | 237144 | 607593.25 | 29745 | 64049.00 | 61768.95 | 1975.73 |
| కర్నూలు | 74934 | 109447.52 | 32847 | 65619.47 | 60411.03 | 5129.07 |
| ఆదిలాబాదు | 84869 | 213075.68 | 17661 | 61290.80 | 53918.28 | 7372.52 |
| ఖమ్మం | 126153 | 265633.27 | 15148 | 55744.54 | 31507.35 | 23963.92 |
| వరంగల్ | 173313 | 173186.5 | 20577 | 57468.40 | 44665.41 | 3868.38 |
| కరీంనగర్ | 144861 | 106780.19 | 18290 | 39218.94 | 34718.19 | 2497.21 |
| మహబూబ్‌నగర్ | 126110 | 209009.99 | 43002 | 51247.03 | 41128.45 | 4769.08 |
| మెదక్ | 157369 | 239361.23 | 21368 | 62108.21 | 46404.02 | 13274.30 |
| నిజాంబాద్ | 145273 | 163163.79 | 11915 | 14595.20 | 14334.16 | 251.04 |
| నల్లగొండ | 149129 | 148687.94 | 40481 | 42776.74 | 34422.34 | 5804.29 |
| రంగారెడ్డి | 734 | 69642.13 | 21161 | 58178.99 | 40358.69 | 17382.54 |
| మొత్తం | 29,23,953 | 42,45,607 | 4,45,237 | 7,96,547,95 | 6,45,608.29 | 1,31,600.94 |

సోర్సు: రాష్ట్రప్రభుత్వ గ్రామీణాభివృద్ధిశాఖ నోట్ నుండి

**భూ సమస్యలు**

కొన్ని భూములకు పేదలకు పట్టాలు ఇచ్చినా భూస్వాముల అధీనంలోవున్నవి. ఆ భూములనుండి వారిని తొలగించి పేదలకు అప్పగించాలి. కొన్ని భూములు అనేక సంవత్సరాలుగా పేదలు చేసుకొంటున్నారు. వాటికి పట్టాలివ్వాలి. కొందరికి పట్టాలిచ్చి, భూములు అప్పగించినప్పటికీ రెవిన్యూ రికార్డులలో వారిపేర్లు నమోదు చెయ్యబడలేదు. పట్టాదారు పాసుపుస్తకాలు ఇవ్వబడటం లేదు. ఈ సమస్యలు పరిష్కరించాలి.

**పంచవలసిన భూములు**

మిగులు భూములు పంపకం తరువాత నిర్మించిన ఇరిగేషన్ ప్రాజెక్టుల క్రింద తిరిగి వర్గీకరిస్తే మరికొంత మిగులు భూమి తేలుతుంది. సుమారు మొత్తం 10 లక్షల ఎకరాల మిగులు భూములు పంచే అవకాశం వున్నది. రాష్ట్ర ప్రభుత్వ గణాంక పత్రాన్ననుసరించి 17.30 లక్షల ఎకరాలు సాగుకు యోగ్యమైన బంజరు భూములు వున్నవి. అలాగే చెట్లు లేని అడవులు 20 లక్షల ఎకరాలు వున్నవి. వీటిలో ఇప్పటికే గిరిజనుల అధీనంలో వున్న 8 లక్షల ఎకరాలు 1980 చట్టాన్ననుసరించి రెగ్యులరైజ్ చెయ్యాలి. మిగిలిన 12 లక్షల ఎకరాలు గిరిజనులకు, పేద ప్రజలకు పంచాలి. తీరప్రాంత బంజర్లు సుమారు 9 లక్షల ఎకరాలు వున్నవి. వీటిలో అత్యధికభాగం ధనిక వర్గాల అధీనంలో ఆక్వా కల్చరు సాగులో వున్నవి. ఈ భూముల నుండి ధనిక వర్గాలను తొలగించి పల్లెకారులకు, పేదవర్గాలకు పంచాలి. ఇంకా సుమారు 9 లక్షల ఎకరాలు తెలంగాణాలో ఈనాం భూములు వున్నవి. దేవాదాయ ధర్మాదాయ భూములు 3.76 లక్షల ఎకరాలు వున్నవి. ఈ భూములలో పేద కౌలుదార్లను రక్షించేందుకు చట్టాన్ని సవరించాలి. పేదవారు కౌలుకు చేసే భూములు కొన్ని భూస్వాముల పేర లీజు కాంట్రాక్టులు వున్నవి. భూస్వాముల అధీనంలో వున్న కౌలు రద్దు చేసి వాస్తవ పేద కౌలుదార్లకప్పగించాలి. ఇంకా 2 లక్షల ఎకరాల ఫారం భూములు వున్నవి. చెరువు లోతట్టు మెరక భూములు వున్నవి. ప్రభుత్వ కార్యక్రమాలకు, ప్రాజెక్టులకు, పరిశ్రమలకు సేకరించి వినయోగించని భూములు వున్నవి.

వన సంరక్షణ సమితుల నిర్వహణ బాధ్యత పేద ప్రజలకప్పగించి నిధులు మంజూరు చెయ్యాలి. ఈ మధ్య రాష్ట్ర ప్రభుత్వం బయోడీజిల్ ఉత్పత్తికి జట్రోపా పెంచే పథకం ప్రకటించింది. ఇది పెంచే బాధ్యత కూడా పేదప్రజలకప్పగించి అవసరమైన నిధులు సమకూర్చాలి. ఇంకా మొత్తం సుమారు 60 లక్షల ఎకరాలు పేద ప్రజలకు వివిధ రూపాలలో సాగుకు అప్పగించే అవకాశం వున్నది. ఈ భూములన్నీ పేదలకు పంచాలి. సాగు బాధ్యత అప్పగించాలి, ఉపాధి కల్పించాలి. అలాగే ఇళ్ళులేని వారికి వెంటనే ఇళ్ళ స్థలాలివ్వాలి. ఇళ్ళు కట్టించి ఇవ్వాలి.

**వెలుగు పథకం**

వెలుగు పథకంలో ప్రధానోద్దేశ్యం గ్రామీణ పేదలకు రావలసిన భూములు, భూస్వాముల అధీనంలో వున్న వాటిలో వారిని తొలగించి పేదలకప్పగించాలి. పేదలకు పంచటానికి, అవకాశం వున్నవి పంచాలి. సాగు బాధ్యత అప్పచెప్పటానికి అవకాశం వున్నవి అలా అప్పగించాలి. భూముల అభివృద్ధికి అవసరమైన పెట్టుబడులు సమకూర్చాలి. వ్యవసాయ నిర్వహణకు తోడ్పడాలి. గ్రామీణ పేదల స్వావలంబనకు అవసరమైన సహాయం చెయ్యాలి. ఈ పథకం లక్ష్యాలు గొప్పవైనా ఆచరణలో అరకొరగా వున్నది. ఈ పథకానికి అవసరమైన నిధులను సమకూర్చి సక్రమంగా అమలుపర్చాలి.

**భూములు అమ్మకుండా నిలబెట్టాలి**

లక్షల ఎకరాలు రాష్ట్ర ప్రభుత్వం పంచినప్పటికీ ఈ భూముల అభివృద్ధికి వ్యవసాయానికి పెట్టుబడులు లేక అప్పులపాలై అనేకులు భూములు తిరిగి భూస్వాములకు అమ్ముకొంటున్నారు. కొందరు ఆత్మహత్యలకు బలి అవుతున్నారు. అందువల్ల పేద వ్యవసాయ కార్మికులకు భూములు పంచటంతో పాటు ఆ భూములలో పంటలు పండించుకొని స్వావలంబనతో జీవించటానికి అవసరమైన పెట్టుబడులు సమకూర్చాలి. భూముల అభివృద్ధికి అవసరమైన పెట్టుబడులు సబ్సిడీగా ఇవ్వాలి. పంటరుణాలు వడ్డీ రాయితీతో ఇవ్వాలి. ఇరిగేషన్ సదుపాయం కలుగచెయ్యాలి. ప్రాజెక్టులు లేని ప్రాంతాలలో బోర్లు, పంపుసెట్ల కవసరమైన పెట్టుబడులు 90 శాతం సబ్సిడీపై ఇవ్వాలి. వీరి వ్యవసాయ ఉత్పత్తులు ప్రభుత్వ సంస్థలే గిట్టుబాటు ధరలకు కొనుగోలు చెయ్యాలి. పేద వర్గాలను వ్యవసాయంలో నిలబెట్టాలి. హరితాంధ్రప్రదేశ్ నిర్మాణానికి పేదలకు భూపంపకంతో పాటు, వారిని భూములలో నిలబెట్టే పథకాలు అమలుపర్చటం అత్యంత అవసరం.



**పాఠకులకు...**

భూసంస్కరణల మీద మరిన్ని వ్యాసాలతో కలిపి అక్టోబరు 14న 48 పేజీలతో ఈ పత్రిక వెలువడుతోంది. కాపీలు కావాల్సినవారు మానేజర్‌కు వ్రాయండి.

# భూ సంస్కరణలను చేపట్టకుంటే చరిత్ర హీనులవుతారు

## భూ సంస్కరణల పూర్వాపరాలు

- విద్యాభూషణ్

'ఆరు నూరైనా- నూరు ఆరైనా ఆర్థిక సంస్కరణలను అమలు పర్చి తీరుతాం' అని తొడగొట్టి విర్రవీగిన వారిని మొన్నటి ఎన్నికల్లో సప్త సముద్రాలకవతల పారేశారు ఓటర్లు. మిగులు భూములను భూమి లేని నిరుపేదలకు నిరాటంకంగా పంచిపెడతాం, పేదవారి ఇక్కట్లను తీర్చడమే తమ ప్రధాన లక్ష్యం అన్న వారిని అందల మెక్కించారు. పేదల సమస్యలకు పరిష్కారంగా భూసంస్కరణలను అమలుపర్చాల్సిందేనన్న వామపక్షాలు తమ వంతు గౌరవాన్ని కాపాడుకో గలిగారు.

భూసంస్కరణలంటే ఏమిటి? సూక్ష్మంగా సూటిగా చెప్పుకోవాలంటే కౌలుదార్ల, సన్నకారు రైతుల, వ్యవసాయ కూలీల మేలును దృష్టిలో వుంచుకొని భూమిని పునఃపంపకం చేయడమే. దాన్నే ఐక్యరాజ్యసమితి కాస్త విస్తృతపర్చి చెప్పిందేంటంటే.. "భూమి పునఃపంపకం మాత్రమే కాక, కౌలు పరిణామ నిర్ణయం, కౌలుదారుల భద్రత, వ్యవసాయ కూలీల వేతన నిర్మాణం, వ్యవసాయ పరపతి మార్గాల అభివృద్ధి, భూమి పన్నుల విధాన పెరుగుదల, సహకార సంస్థల అభివృద్ధి, వ్యవసాయ విధాన బోధన, వ్యవసాయంలో సాంకేతిక మార్పులు" మొదలైన వన్నీ భూసంస్కరణలుగానే చెప్పి వాటి ఆవశ్యకతను పరిధిని మరింత విస్తృతం చేయడం జరిగింది.

వ్యవసాయరంగం ఆశించిన దిశలో అభివృద్ధి చెందలేకపోవడానికి కారణం వ్యవస్థాగత అంశాలే కీలకం. అందువల్ల నిర్మాణాత్మకంగా భూసంస్కరణలను అమలు పర్చాల్సిందే. భూయాజమాన్యంలో అసమానత, భూకేంద్రీకరణ, లాభసాటిగా లేని కమతాలు, హెచ్చు కౌలు, కౌలుదార్ల అభద్రత, గ్రామీణ రణ సమస్య లన్నింటికీ, ఈ భూసంస్కరణలే సమాధానం చెప్పగలుగుతాయి.

ఇక మన ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణల ఆవశ్యకతను గమనిస్తే, నేటి రాష్ట్రం నాడు రెండు తరహాల భూస్వామ్య వ్యవస్థలో ఇరుక్కొంది. ఒకటి బ్రిటీష్ వారి విధానం, రెండోది నైజాం తీరు. ఈ రెండూ జాగిర్దారీ లేదా జమిందారీ పద్ధతులే. రెండోది రైత్వారీ పద్ధతి. అయితే 1853లో కార్ల్ మార్క్స్ బ్రిటీష్‌వారు ప్రవేశపెట్టిన ఈ విధానాలు రెండూ పరస్పర విరుద్ధమైనవని ప్రకటించాడు. ఒకటి పెత్తందారీ వ్యవస్థ రెండోది ప్రజాతంత్ర వ్యవస్థ. ఈ రెండిటి లక్ష్యం మాత్రం భూములపై పన్నులు రూపేణా ప్రభుత్వాలకు ఉపయోగపడే సాధనాలుగా రూపొందించారనీ విశ్లేషించాడు మార్క్స్.

**హైదరాబాద్ రాష్ట్రంలో భూస్వామ్య విధానం:**

నైజాంకు ప్రత్యేక సేవ చేసిన వారికి ఉచితంగా ఇచ్చేసిన గ్రామాలను జాగీర్లనే వారు. హైదరాబాద్‌లో 6,535 గ్రామాల్లో 40 వేల చదరపు మైళ్ళ విస్తీర్ణం వరకూ వ్యాపించి ఉండేది. 1922లో జాగీర్లసంఖ్య 1,167 వుండగా 1949 నాటికి 1,500 వరకూ పెరిగాయి. ఇవి కాక సంస్థానాలు వుండేవి. చిన్నచిన్న ప్రాంతాలకు అధిపతులుగా చెప్పుకున్న రాజుల హక్కుల నంగీకరించడానికి నైజాంకు ఏటా నిర్ణీత మొత్తాన్ని చెల్లించేవారు. వారికా ప్రాంతాల్లో విస్తృతమైన అధికారాలుండేవి కనుక కొల్లగొట్టుకునే వారు. ఈ తరహా 497 గ్రామాలు- 5030 చదరపు మైళ్ళ విస్తీర్ణం. తరువాత రూపం ఇనాందార్లు. కొన్ని సేవల గుర్తింపుకు బహుమానంగా భూములను ధారాదత్తం చేయడం. ఆ భూములనుంచి వచ్చే శిస్తులను పూర్తిగానో పాక్షికంగానో పొందే హక్కు ఈ ఈనాందారుకుండేది. హైదరాబాద్ సంస్థానంలో ఇనాందారుల సంఖ్య 82 వేలుండగా, వీరి అధీనంలో 8 లక్షల ఎకరాల భూమి వుండేది. ఇక మిగిలింది 'సర్ఫెఖాస్' అంటే నిజాం వారి స్వంత ఖర్చులకోసం నిర్దేశించిన భూమి లేదా గ్రామాలు. సుమారు 1,374 గ్రామాల్లో 5,682 మైళ్ళ విస్తీర్ణంలో వుండేవి.

హైదరాబాద్ ప్రాంతంలో మొత్తం సేద్యంలో 60 శాతం ప్రభుత్వ ప్రత్యక్ష పాలన కింద వుండేది. 1875 నాటి సర్వే సెటిల్‌మెంటుతో వేల ఎకరాలను తమపేరుమీద రాయించుకుని పెద్ద పెద్ద భూస్వాములుగా శిస్తులను వసూళ్ళు చేసే దేశ్‌ముఖ్‌లు అవతరించారు. వీరు అమలు చేసిన 82 రకాల నిర్బంధ వసూళ్ళలో ఉత్పత్తితో సంబంధంలేని భూమిశిస్తు ప్రధానమైంది.

**ఆంధ్రప్రాంతంలో భూస్వామ్య పద్ధతులు:**

ఈ ప్రాంతంలో కూడా జమిందారీ, ఇనాందారీ రైత్వారీ పద్ధతులుండేవి. జమిందారీ పద్ధతి అంటే 1802లో మద్రాసు రాష్ట్రం జారీచేసిన శాశ్వత శిస్తు విధాన చట్టాన్ని అనుసరించి జమిందార్లకు వంశపారపర్య హక్కును అంటగట్టారు. మద్రాసు ప్రెసిడెన్సీలో వున్న మొత్తం జమిందారీ భూముల్లో 70 శాతం (152 లక్షల ఎకరాలు) మన ఆంధ్రప్రదేశ్ లోనివే. వీరు ప్రభుత్వానికి చెల్లించేదానికన్నా రైతులనుంచి అనేక రెట్లు అధికంగా శిస్తు పేరిట వసూలు చేసేవారు. వ్యవసాయ అభివృద్ధి అనేది మాట మాత్రంగానైనా తలెత్తేదే కాదు అందిన మేరకు దోచుకోవడమే లక్ష్యం.

**ఇనాందారీ**

హైదరాబాద్ రాష్ట్రంలో లాగే ఇక్కడా పల్లకీమోతలు మోసేవారికి ఇచ్చే బహుమానం.. 2.10 లక్షల ఎకరాలు ఇది ఈనాంల రూపేణా వుండేది.

**రైత్వారీ విధానం**

భూమిని సాగుచేసే రైతు ప్రత్యక్షంగా చెల్లించాల్సిన శిస్తు 1972లో థామస్ మన్రో ప్రవేశపెట్టాడు. భూసారం, ఉత్పత్తి, వ్యయం దృష్టిలో పెట్టుకొని శిస్తు నిర్ణయం జరిగేది-ఓ పాతిక ముప్పై ఏళ్ళకోసారి. మళ్ళీ ఇక్కడా వర్గ పక్షపాతమే. జమీందార్లు ఎకరానికి నాలుగణాలు అంటే 25 పైసలు చెల్లిస్తే రైతులు మాత్రం ఎకరానికి 2.50 రూపాయలు చెల్లించాలన్నది న్యాయబద్ధంగా వుండేది. ఫలితం ఇప్పటి రైతుల దారుణ పరిస్థితే నాడుకూడా. రుణభారం, అమ్మకాలు, తనఖాలు, వడ్డీవ్యాపారుల ప్రాబల్యం, పెద్ద భూస్వాముల ధనదాహం. సన్న, చిన్నకారు రైతుల భూములు ,పెద్ద భూస్వాముల ఖాతాల్లోకి చేరిపోయాయి, వాగుల్లో నీరంతా సముద్రం పాలయినట్టు. 1931-34 లోనే సుమారు కోటి ఎకరాలు చేతులు మారినట్టు ఒక అంచనా. 1951 నాటి జనాభా లెక్కల ప్రకారమే వ్యవసాయం చేయని యజమానులు 12.5 లక్షల మంది.

ఈ తరహాలో అటు నైజాం, ఇటు ఆంధ్రాప్రాంతంలోనూ భూస్వామ్య విధానాలు అత్యంత నిరోధకంగా మారాయి. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఈ మధ్యవర్తుల తొలగింపు అత్యంత ఆవశ్యకమైయింది.

**దారుణదోపిడీ-"కౌలుదారీ విధానం"**

హైదరాబాద్ రాష్ట్రంలో నిజాం హయాంలో 1354 ఫసలీ (1944)లో అసామీషకీ చట్టం అమలులోకి వచ్చింది. అసామీషకీ అంటే శాశ్వత కౌలుదారు. 12 ఏళ్ళు నిరాటంకంగా ఆ భూమికి కౌలుదారుగా వ్యవహరిస్తేనే శాశ్వత కౌలుదారుగా గుర్తింపు. ఈ ఫ్యూడల్ వ్యవస్థలో 12 ఏళ్ళు కౌలుచేయడం ఒక ఎత్తయితే దాన్ని నిరూపించుకోవడం మరో ఎత్తు. కాగా ఇక అందరూ అసామిషక్మిదారులు (రక్షణలేని కౌలుదార్లే) కౌలుదార్ల చట్టాలను సవరించకుంటే కష్టనష్టాలు తప్పవని యం.యస్.భరూచా 1937లో సూచించగా, 1354 ఫసలీ (1944) అమల్లోకి వచ్చింది.

**ఆంధ్రప్రాంతంలో కౌలుదారీ చట్టం:**

ఇక్కడ కూడా హైదరాబాద్ రాష్ట్రం మాదిరిగానే రెండు రకాల కౌలుదార్లుండేవారు. పేర్లు తేడా అంతే. భూస్వామి భూమి అమ్మాలనుకొంటే ముందు కౌలుదారుకి అవకాశం ఇవ్వడం వంటి స్వల్ప తేడాలుండేవి. మళ్ళీ కౌలు పరిమాణంలో పెరుగుదల, రక్షణ లేకపోవడం అంతటా ఒక్కటే. ఈ రెండు ప్రాంతాల్లోను కౌలు చెల్లింపులు ఒకే పద్ధతిలో కొనసాగేవి. మూడు ధోరణులు ప్రధానంగా: 1. పంటలో భాగం 2. పండించే పంటలో స్థిరమైన భాగం(ఉత్పత్తితో సంబంధం లేకుండా) 3. స్థిరమైన కౌలు ద్రవ్యరూపంలో.

వీటి అమలు కాలంలోనే భూమిని కౌలుకు తీసుకొనే క్రమంలోనూ, కౌలు పునరుద్ధరణ సమయంలోనూ రైతులు భూస్వాములకు కానుకలు సమర్పించుకునే సంప్రదాయం వుండేది. కాలక్రమేణా భూమిశిస్తు విశేషంగా పెరిగిపోవడం, జమీందార్ల అధికారబలం వలన, భూయాజమాన్యం సామాజిక చిహ్నంగా మారడం వల్ల, భూమి డిమాండు పెరిగి కౌలుదార్లు పెరిగారు. జమీందార్ల దోపిడీ నుండి రక్షణలేని పరిస్థితి వ్యవసాయాన్ని ఉత్సాహ వంతంగా చేయలేని పరిస్థితి నెలకొంది. ఆర్థిక సంస్కరణలు పెట్టుబడిని పెంచేసిన కారణంగా నెలకొన్న పరిస్థితి తరహాలోనే. నిస్సారభూమిని ఉద్యానవనంగా మార్చేరైతు, ఏడెనిమిదేళ్ళ సేద్యం తరువాత ఎడారిగా మార్చేసిన పరిస్థితి నెలకొంది. వ్యక్తిగత యాజమాన్యం వ్యవసాయాభివృద్ధికి దోహదం చేస్తే, ఒకరి దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుండటం వ్యవసాయాభివృద్ధికి దోహదపడదు. కారణంగా కౌలు సంస్కరణలకు ఆవశ్యకత ఏర్పడింది.

భారతదేశంలో స్వాతంత్ర్యానికి పూర్వం భూవసతి కొద్ది మంది చేతుల్లోనే కేంద్రీకృతమై పోయింది. భూగరిష్టపరిమితిని నిర్ణయించి, అసమానతలు తగ్గించాలనే లక్ష్యానికి బీజం పడింది. తద్వారా వ్యవసాయ రంగంలో స్వయం ఉపాధికి మార్గం సుగమనం అవుతుంది. భూకేంద్రీకరణ పెట్టుబడిదారీ తరహా సేద్యానికి దారితీసి ఉపాధి అవకాశాలను కుదిస్తుంది. నేటి కుప్పం ప్రయోగాలూ దీన్నే సూచిస్తున్నాయి. దీనికి పరిష్కారం చిన్నకమతాలైనా ఎక్కువమందికి యాజమాన్య హక్కుల్ని కల్పిస్తే ఉపాధి లభిస్తుంది. స్వంతభూమి అనే భావన హెచ్చు ఉత్పత్తికి దోహదపడే దాఖలానూ మనం గత చరిత్రనుండి పొందగలం.

పెద్ద క్షేత్రాలను చిన్న కమతాలుగా విడగొడితే ఉత్పత్తి తగ్గొచ్చని, విక్రయానికి, మూలధన సేకరణకు విఘాతం కలుగుతుందని, భూస్వాముల నష్ట పరిహార చెల్లింపు ప్రభుత్వానికి భారమౌతుందని, భూమిలేని నిరుపేదలకు భూమినిస్తే పెట్టుబడి కొరత వల్ల సద్వినియోగం కావని, చిన్న సన్నకారు రైతులు తమకవసరమైన తిండి గింజలనే పండించడం వాణిజ్య పంటల కొరతకు దారితీస్తుందని, మిగులు భూములుగా ఎందుకూ పనికిరాని భూముల్నే చూపడంతో అధిక శ్రమ-పెట్టుబడి అవసరమౌతుందనే విమర్శలు మనముందున్నాయి. అయితే చిన్న కమతాలు సేద్యం అధిక దిగుబడికి అవరోధమౌతుందనే వాదనను జపాన్ అనుభవంతో ఆర్థర్ లూయిస్ తిప్పి కొట్టాడు. 1962లో డాక్టర్ మాన్ పంజాబ్‌లో పెద్ద కమతాల్లో కంటే చిన్న కమతాల్లోనే అధిక దిగుబడిని సాధించామని నిరూపించాడు. నష్ట పరిహార సమస్య ప్రభుత్వ ఖజానాకు భారమైనప్పటికీ దీర్ఘకాల ప్రయోజనాల దృష్ట్యా భరించవలసిందే. చిన్న కమతాల్లో సైతం ఆదాయం గరిష్టంగా వుండే పంటలకే ప్రాధాన్యత నిస్తారు. ఈ విరుద్ధాంశాలన్నీ చైనా, జపాన్, తైవాన్, ఈజిప్టు, అల్జీరియా వంటి దేశాల అనుభవాల ముందు నిలువ లేకుండా తేలిపోయాయి.

**మొట్టమొదటి భూసంస్కరణలు(1947-1970)**

స్వాతంత్ర్య సముపార్జనలో గ్రామీణ రైతాంగాన్ని భాగస్వామ్యం చేయాలనే గాంధీ యోచన సఫలమైంది. 1917-18లో బీహార్ చంపారన్ రైతు పోరాటం, ఖెడా జిల్లా రైతు విముక్తి పోరాటాలు,

గ్రామీణులను చైతన్యపర్చి, సహాయ నిరాకరణ, పన్నుల నిరాకరణ, శాసనోల్లంఘనం వంటి ఉద్యమ స్ఫూర్తికి బాసటగానిల్చాయి. దీంతో 1928 నాటికి భూస్వామ్యాన్ని అంతమొందించి, రైతాంగం మీదనే దేశ భవిష్యత్ ఆధారపడి వుందని స్వయాన నెహ్రూయే పిలుపునివ్వడం గమనార్హం. దీని ఫలితంగానే 1931 కరాచీ కాంగ్రెస్ జమిందారీ వ్యవస్థ రద్దుకు తీర్మానించగలిగింది. 1936 ఎన్నికల మేనిఫెస్టోలో భూసమస్యల పరిష్కారం అగ్రభాగాన చోటుచేసుకుంది. ఎన్నికలనంతరం బీహార్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌లలో కౌలుదార్ల రక్షణ, పాతబాకీలపై 'మారిటోరియం' అనివార్యమైయింది నేటి పరిస్థితిలాగానే. 1946 ఎన్నికల నాటికి వ్యవసాయ సంస్కరణల కమిటీల ఏర్పాటు, తద్వారా భూసంస్కరణల చట్టాలు పురుడు పోసుకున్నాయి. 1946 ఎన్నికల్లో కాంగ్రెస్ అధికారానికి వచ్చి 1947 నవంబర్ 28న జమిందారీ రద్దు బిల్లు శాసనసభలో ప్రవేశపెట్టడం జరిగింది. కాలక్రమంలో హెచ్చు జమిందార్లు కాంగ్రెస్‌లో చేరడంతో.. కౌలుదార్ల సమస్యల పరిష్కారానికి 'దున్నేవాడికి భూమి' అనే నినాదం అమలు, భూసంస్కరణలపట్ల అమలుకు కాంగ్రెస్‌లో చిత్తశుద్ధి లోపించింది. కాంగ్రెస్ ఆధ్వర్యంలో అధికార మార్పిడి జరిగిపోయిందిగా. ఏరుదాటి తెప్ప తగలెయ్యడానికిదే అంకురార్పణ.

**భూసంస్కరణలకై తపించిన రైతాంగ ఉద్యమాలు:**

1832లో ఖోండుల తిరుగుబాటు, 1858లో గోదావరి ఏజెన్సీ, 1864 గంజాం ఏజెన్సీ, 1879 రంపపితూరీ, 1846లో కోయిలకుంట్ల, 1894 కృష్ణాజిల్లా రైతుల నీటి తీరువా పెంపుపై నిరసన మొదలైనవి ముఖ్యమైనవి. 1920 నాటికి జాతీయోద్యమస్ఫూర్తి రైతు సంఘాల ఏర్పాటుకు నాంది పలికింది. 1928లో ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం ఆచార్యరంగా నేతృత్వంలో ఏర్పడింది. 1931లో ఆంధ్రరాష్ట్ర జమీన్ రైతుసంఘాలు, 1936 కాంగ్రెస్ నాటి (లక్నో) సభలో అఖిల భారత కిసాన్ సభ ఏర్పాటు జరిగింది. నాటి రైతాంగ పోరాటాలు ఎప్పటిలాగానే ఒకవర్గం వారి సమస్యలను ప్రభుత్వం దృష్టికి తీసుకొచ్చేదిగా వుంటే మరో వర్గం వారి హక్కుల కోసం ఉద్యమించేందుకు దోహదపడ్డాయి.

1930లో ఆర్థిక మాంద్యం దృష్ట్యా రుణాలపై మారిటోరియం ప్రకటించాలని కోరుతూ ఆంధ్రప్రాంతంలో అనేక పోరాటాలు జరిగాయి. జమిందారీ ప్రాంతాల్లో నెల్లూరు, వెంకటగిరి, చిత్తూరు, విశాఖ, శ్రీకాకుళం (బొబ్బిలి పర్లాకిమిడి, పలాసా, మందసా) పశ్చిమ గోదావరి (కాశీపట్నం, కలమపల్లి, పెండ్యాల, గోపాలపురం, పోతునూరు) కృష్ణా (చల్లపల్లి, ముక్త్యాల, తిరువూరు, మునగాల) జిల్లాల్లో పోరాటాలు జరిగాయి. వెట్టిచాకిరీ, అధిక శిస్తులనిరసిస్తూ, దౌర్జన్యాలను ఖండిస్తూ, హెచ్చు కూలీ కోసం, జిరాయితీ హక్కులకోసం ఈ పోరాటాలన్నీ కాంగ్రెస్ కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో నిర్వహించబడ్డాయి. 1940 నుండి వామపక్ష వాదుల సంఖ్య పెరుగుతూ వచ్చి 1945 నాటి ఖమ్మం మహా సభలో నైజాంకు వ్యతిరేకంగా రైతాంగ పోరాటానికి పిలుపునిచ్చే స్థాయిని అందుకుంది.

**తెలంగాణా సాయుధ పోరాటం**

ఈ మహత్తర పోరాటంలో పదివేల గ్రామదళ సభ్యులు రెండువేల గెరిల్లా సభ్యులతో కూడిన శక్తివంత సాయుధ బలగం 3000 గ్రామాల్లో గ్రామ సభలను నిర్వహించగలిగింది. జాగీర్‌దార్లను దేశముఖ్‌లను వెళ్ళగొట్టి 10 లక్షల ఎకరాల భూముల్ని పునఃపంపిణీ చేసుకోగలిగారు. వ్యవసాయ కార్మికుల వేతనాలు పెరిగాయి. 12 నుండి 18 నెలల వరకూ మొత్తం గ్రామపాలన గ్రామీణ రైతు కమిటీల ఆధ్వర్యంలో నడిచింది. ఈ పోరాటంలో నాలుగు వేల కమ్యూనిస్టులు బలయ్యారు. పదివేలమందిని బంధించారు. ఈ పోరాటం ధాటికి నిజాం దిగిరాక తప్పలేదు. విప్లవాత్మక భూసంస్కరణ చట్టాలు చేపట్టారు.

1952 ఎన్నికల తర్వాత ప్రణాళికాసంఘ సూచనలమేరకు 1953లో హైదరాబాద్ కౌలు, వ్యవసాయ భూముల సవరణ బిల్లు వచ్చింది. ఈ శాసనంలో భూస్వాములు కౌలుదార్ల నుండి భూమి తీసుకునేందుకు కొన్ని నియమాలు సూచించారు. భూస్వామి తప్పనిసరిగా కౌలుదారుని కుటుంబ భృతి కోసం అవసరమైనంత కమతాన్ని వదిలి, కమతానికి మూడురెట్ల భూమిని తీసుకోవాలి. కౌలుదారు తాను సేద్యం చేసే భూమిని తానే కొనుక్కొనే వెసులుబాటు కలిగింది. భూస్వామికూడా ముందుగా కౌలుదారుకే అవకాశమివ్వాలి. ధర చెల్లింపులు కూడా ఒకేసారి గాని, ఎనిమిది సంవత్సరాల్లో 16 వాయిదాల్లో చెల్లించాలి. దీన్ని హైదరాబాద్ ప్రివెన్షన్ ఆఫ్ ఎవిక్షన్ ఆర్డినెన్స్ (1952) అంటారు. 1968 ఆగష్టు 15 నుండి అన్ని జిల్లాల్లో అమలుకు నిర్ణయించగా, భూస్వాములు కోర్టు నాశ్రయించారు. లోపాలను తొలగించడానికి 1973లో నోటిఫికేషన్ జారీ చేశారు.

ఆంధ్రప్రదేశ్ కౌలుచట్టం 1956 నుంచి అమలయ్యింది. దీని ప్రకారం ఉత్పత్తిలో 1/3 వంతు కౌలుగా, కౌలు ఒడంబడికలు ఆరేళ్ళపాటు అమల్లో వుండొచ్చు. ఆరేళ్ళ తరువాత భూస్వామి తన భూమి తీసుకోవచ్చు.

భూకమతాలపై గరిష్ట పరిమితి బిల్లు, చట్టంగా 1961లో వచ్చింది. భూములు చట్టపరిధిలోకి రాకుండా బినామీ పేర్లతో సురక్షితం అయ్యేందుకు వీలు కలిగింది. కుటుంబంలో ఒక్కోవ్యక్తి ఒక్కో యూనిట్‌గా తీసుకోవడడం మరో పచ్చి అవకాశవాదం. దేవాలయ భూములు, చెరుకు పండించే భూములు, కాఫీ, తేయాకు, రబ్బరు తోట పంటలకు సంబంధించిన భూములను చట్ట పరిధిలోకి రాకుండా రక్షించారు. వేలాది ఎకరాలను భూస్వాములు జమిందార్లు రక్షించుకోగలిగారు. ప్రభుత్వం భూస్వామ్య వర్గాలదే అయినందున విప్లవాత్మక నిర్ణయాలకు ప్రభుత్వం ముందంజ వేయలేదు.

ఈ విధంగా భూసంస్కరణలు నీరుగారిపోయిన తరువాత వాటి ఆవశ్యకతను గుర్తించేందుకు మూడు అంశాలు ప్రధాన కారకాలయ్యాయి. హరితవిప్లవ ఫలితంగా గ్రామీణ ప్రాంతాల్లో వచ్చిన

ఆర్థిక పరమైన మార్పులు. రాజకీయ రంగంలో వచ్చిన మార్పులు రైతాంగ పోరాటాలు. మొదటిరెండు కారణాల కన్నా, 1968-69 లో నక్సల్బరీ-శ్రీకాకుళ గోదావరీ లోయ ప్రాంతాల్లో వెల్లువెత్తిన మిలిటెంటు పోరాటాలు భూసంస్కరణల ఆవశ్యకతను వెలుగులోకి తెచ్చాయి. అధికార కాంగ్రెస్‌లో చీలిక, ఇందిరాగాంధీ ప్రజల్ని ఆకర్షించుకోవడానికి పావుగా 1973లో భూ గరిష్ట పరిమితి చట్టాన్ని తీసుకురావాల్సి వచ్చింది. ఈ చట్టాన్ని అమలు పర్చడం ద్వారా 20 లక్షల ఎకరాలు మిగులు భూములుగా వస్తాయని అంచనాలు వేయగా, ఆచరణలో 5 లక్షల పదివేల ఎకరాలను స్వాధీనం చేసుకుని ఎస్సీ, ఎస్టీలకు పంచామని ప్రభుత్వం చెబుతుంది. 1976లో హైకోర్టు భూస్వాములకు అనుకూలంగా తీర్పునిచ్చింది. రిజిస్టర్ కాకున్నా, తెల్లకాగితాల పై మార్పిడులు పేదల చేతుల్లోనూ మిగిలిపోయాయి. 1982లో హైకోర్టు తీర్పును కొట్టివేస్తూ భూగరిష్టపరిమితి చట్టాన్ని బలపరుస్తూ 1982 మార్చి 5న సుప్రీంకోర్టు తీర్పునిచ్చింది. అయితే ఏ రాష్ట్ర ప్రభుత్వమూ దీన్ని పరిగణనలోకి తీసుకోలే.

1985 మే నెలలో కేంద్రప్రభుత్వం అన్ని రాష్ట్రాల రెవెన్యూ మంత్రులతోనూ సమావేశం ఏర్పటుచేసి భూసంస్కరణల అమలు విషయమై చర్చించింది. 1. భూపరిమితిని మాగాణి (రెండుపంటలు) 5 హెక్టార్లు, ఒక పంట పండేది 12 హెక్టార్లకు తగ్గించాలి. దేవాదాయ ధర్మాదాయ భూములనూ భూగరిష్ట పరిమితిలోకి తీసుకురావాలి. 3. కౌలుదార్లకు పాలికాపులకు కౌలు హక్కులు, భూమి పట్టా హక్కు కల్పించాలి. 4. పట్టాదార్ల భూములను తిరిగి ఎవ్వరూ ఆక్రమించుకోకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేపట్టాలి. 5. పెండింగ్‌లో వున్న భూసంస్కరణ కేసుల సత్వర పరిష్కారం కోసం హైకోర్టుల్లో ప్రత్యేక బెంచ్‌లను ఏర్పాటుచేయాలి. 6. ఈ నిర్ణయాలన్నింటినీ రెండేళ్లలోగా (1987 మే నెల) అమలు పర్చాలి. వీటి అమలు నేటికీ ఎక్కడ వేసిన గొంగళి అక్కడే తీరున ఒక్క నిర్ణయమూ అమలుకు నోచుకోలే. అధికారంలోకి వచ్చిన ఏ రాజకీయ పార్టీకి భూ సంస్కరణల పట్ల చిత్తశుద్ధి లేకపోవడమే ఇందుకు ప్రధాన కారణం. అస్పష్టంగా న్యాయవ్యవస్థ జోక్యం. తాజా సమాచారంతో కూడిన రికార్డులు లభ్యం కాకపోవడం భూస్వామ్యం చేతిలో రాజ్యాధికారం. అధికారులు అమ్ముడు పోవడం వెరసి భూసంస్కరణల వైఫల్యం.

**మిగులు భూములు:**

ఎ. రెండు లక్షల ఎకరాలకు పైగా మిగులు భూములు కోర్టు పెండింగులో వున్నాయి. ముప్పై ఏళ్ల క్రితం మెట్టగా చూపింది నేడు మాగాణీ అయింది. గరిష్ట పరిమితిని 25 ఎకరాలకు తగ్గించిన 1990-91 గణాంకాల మేరకు మిగులు భూమి 16 లక్షల ఎకరాలకు పై చిలుకే తేలాల్సి వుంది.

**దేవాలయ ధర్మాదాయ భూములు:**

బి. 5 లక్షల ఎకరాలకు పైగావుంది. 80 శాతం భూమి కౌలు రూపంలో భూస్వాముల చెంతనే వుంది. వాస్తవంగా ఐదు ఎకరాల మాగాణి, 10 ఎకరాల మెట్ట కలిగిన వారికి ఈ భూములు కౌలుకు ఇచ్చే వీలులేదు.

**తీరప్రాంత భూములు**

సి. ఆంధ్రా కోస్తా ప్రాంతాల్లో తీర ప్రాంత భూములు 5 లక్షల ఎకరాలకు పైగా వున్నాయి. మత్స్యకారులు, ఉప్పురైతులు ఈ భూములు వినియోగించుకొంటున్నారు. చట్టరీత్యా ఎవరూ కౌలుదార్లు కాదు. రొయ్యల పెంపకానికి బహుళజాతి సంస్థలు ఈ భూముల న్నాక్రమించుకుని అనుభవిస్తున్నారు. ప్రభుత్వం అనుకూల ఉత్తర్వులను జారీ చేసింది. ప్రజా ఉద్యమ ఫలితంగా అవి చెల్లకుండా పోయినాయి. ఈ భూములపై ఆధారపడే నిజమైన హక్కుదార్లకు వాటిని సంక్రమింప జేయాలి.

**బంజరు భూములు:**

డి. రాష్ట్రంలో ఇప్పటికే 34 లక్షల బంజరు భూములను పంచినట్టు చెట్టుకుంటున్నా, చాలా భూములు పేదల చేతుల్లో లేవు. ఈ భూములనే కౌలుకు ఇవ్వటం, అమ్ముకోవడం జరుగుతుంది. నిజమైన లబ్ధిదార్లను గుర్తించాలి.

**భూధాన భూములు:**

ఇ. రాష్ట్రంలో నేటికీ 90 వేల ఎకరాలకు పైగా భూమి పంచకుండా వుంది. అన్యాక్రాంతమైన వీటిని బడుగువర్గాలకు అందజేయాల్సి వుంది. అటవీ బంజర్లుగా ఎనిమిది లక్షల ఎకరాలు సేద్యానికి అనువైన భూమి వుంది. గిరిజనులకు దీన్ని అప్పగించాలి.

**గిరిజన భూముల సమస్య:**

రాష్ట్రంలో 3 లక్షల ఎకరాల గిరిజన భూములు అన్యాక్రాంతమైనాయి. ఈ భూములపై హక్కుల పరిరక్షణ కనువుగా 1/70 గిరిజన రెగ్యులేషన్ చట్ట అమలుకై చర్యలు తీసుకోవాలి. వివిధ ట్రస్టులకింద, ఫామ్స్‌కింద, బోగస్ సొసైటీల కింద ఐదు లక్షల ఎకరాల భూమి అక్రమ హక్కుగా కొనసాగుతుంది.

ఈ రకంగా వివిధ రూపాల్లో లక్షలాది ఎకరాలు అన్యాక్రాంతంగా వినియోగింపబడుతుంటే, గ్రామీణ పేదలు దారిద్రంమాటున బతుకులు వెళ్ళతీస్తున్నారు. సాంఘిక అసమానతలు తొలగాలంటే భూసంస్కరణల అమలు తక్షణ కర్తవ్యంగా చేపట్టాల్సి వుంది. మనది వ్యవసాయ దేశం అయినందున భూసంస్కరణల అమలు అనివార్యం.

పేద ప్రజలకు అంకితమైన పార్టీగా, ప్రజా సమస్యల పరిష్కారానికి పెద్దపీట వేసేదిగా చెప్పుకుంటున్న ప్రభుత్వం-భూసంస్కరణల ఆవశ్యకతను గుర్తించాల్సి వుంది.

సమూలమైన 'రాజకీయ విప్లవం' లేకుండా సమూల 'వ్యవసాయ సంస్కరణలు' సాధ్యం కావనే గత చరిత్ర మరోసారి పునరావృతం కావాల్సి వుంది. ఆ బాధ్యత ప్రగతిశీల శక్తులదే మరి, ఎందుకంటే 'చిత్తశుద్ధి'ని శంకించగలస్థాయికి ప్రజలెదిగారు.



# చీకటినుంచి చీకట్లోకి...ఓ 'జంగు' కథ

అతనో దగాపడ్డ జీవచ్ఛవం. పేరు జంగు! వయసు తెలీదు. యువకుడే అయివుండవచ్చు కానీ అన్నిరకాల వార్ధక్యపు ఛాయలు మీదపడ్డాయి. బతుకు తాలూకు ఎదురుదెబ్బలు తగలవలసిన దానికంటే ఎక్కువే తగిలాయి. తనకెవరైనా సాయం చేస్తారేమోనని దిక్కులు చూసే శక్తి కూడా ఇప్పుడతనికి లేదు. ఇలా తనలాగా దగాపడ్డ గోండ్లు ఇంకా ఎంతమంది వున్నారో జంగూకు తెలియదు. జంగు ఆలోచిస్తున్నాడు. భవిష్యత్తు గురించి కాదు తన గతం గురించి.. అతనికి భవిష్యత్తు లేదు; వున్నదంతా బరువైన గతమే!

అనంతరామ్‌సోము... ఆదిలాబాద్ ప్రాంతంలో పుట్టిన గోండు పటేల్. కొద్దిపాటి భూమిలో బంగారం పండించుకుంటున్న ఈ గిరిజనుడు ఊళ్ళో అందరికీ పెద్ద తలకాయ. ఎవరికేకష్టం వచ్చినా ప్రత్యక్షమయ్యే సోము అంటే గౌరవం కూడా. ఆ ఊళ్ళోకి కొత్త వాళ్ళెవరు వచ్చినా సోము ఇంట్లోనే ఆతిధ్యం! వచ్చటి పొలాలు..చుట్టూ కొండకోనలు. బంగారం పండే ఈ భూముల మీద నిజాం నవాబుల కన్నుపడింది. ఇప్పటి నేషనల్ హైవేకు ఆవతలివునే వున్న సారవంతమైన భూములంటే సహజంగానే ఇటు తెలంగాణా..అటు మహారాష్ట్ర కామందులకు ఆకలేసింది. ఈ కుట్రలు కుతంత్రాలు తెలియని సోము తన గిరిజనేతర మిత్రులకు ఎప్పటిలాగానే ఆతిధ్యమర్యాదలు చేస్తూనే వున్నాడు. అయితే ఆ ఆతిద్యబంధం ఎక్కువకాలం కొనసాగలేదు. అవి గాంధీజీ ఉప్పుసత్యాగ్రహం చేస్తున్న రోజులు సరిగ్గా అదే సమయంలో రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ సోము దగ్గరకొచ్చాడు. ఏవో కాగితాలు చూపించి "ఫలానా వ్యాపారస్తుడి భూమిని నువ్వు దున్నుకొంటున్నావు... వెంటనే ఖాళీ 'చేయాలి' అంటూ తాఖీదు జారీ చేశాడు. తన తాత ముత్తాతల నుంచి ఇదే భూమిని సాగుచేసుకొంటున్నామని సోము ఆ ఇన్‌స్పెక్టర్ కాళ్ళావేళ్ళా పడ్డా అతను కనికరించలేదు. ఎవరి పట్టా భూమిలోనో నువ్వెలా వుంటావంటూ ఖాళీ చేయించాడు.

తరతరాలుగా వున్న సొంత ఊరిని..ఇంటిని వదిలి పెట్టి సోము వెళ్ళిపోయాడు. ఎక్కడెక్కడో తిరిగి..మైళ్ళకు మైళ్ళు నడిచి, దట్టమైన అడవిలో ఓ చోట (ఇప్పటి ఉట్నూరు) స్థిరపడ్డాడు. వయసు మీద పడ్డా... కొంతమందితో కలిసి ఆ కొండకోనల్లో కాయకష్టం చేసి కొంత భూమిని సాగుచేసుకొంటున్నాడు. సరిగ్గా అదే సమయంలో గుర్రమెక్కి ఓ ముస్లిం అతనున్న చోటుకు వచ్చి.."నువ్వు దున్నుకొంటున్న భూమి నాది" అంటూ నిజాం నవాబు తనపేరిట నాలుగువేల ఎకరాలపై హక్కుపత్రాన్ని చూపించాడు. 'ఇజరాదార్' పేరుతో వున్న సదరు హక్కు పత్రాల గురించి ఏమీ తెలియని సోము లొంగిపోయాడు. తన భూమిలో తానే కౌలుదారుడిగా మారిపోయాడు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. వాడవాడలా స్వాతంత్ర వేడుకలు ఘనంగా జరుపుకొంటున్నారు. తన సొంతభూమిని రెండుసార్లు వదులుకుని కేవలం ఓ రైతు కూలీగా మారిన సోముకు 'స్వాతంత్రానికి' అర్ధం తెలియలేదు. ఇక్కడ చిన్న మలుపు. అక్కడి తాలూకాదారు సోము పేరును కౌలుదారుడిగా నమోదు చేసుకున్నాడు(1951 ప్రొటెక్టెడ్ టెనెంట్) కానీ సోము కథ మళ్ళీ వక్రించింది. దగాపడ్డ సోము పూర్తిగా ఢీలాపడ్డాడు. మంచం పట్టి కొన్నిరోజులకే మరణించాడు. సోము వదలిపెట్టిన అప్పయినా, ఆస్థి అయినా అతని కొడుకు జంగూయే!

తండ్రిపోయిన జంగూకు బతుకుతెరువు కోసం మళ్ళీ ప్రయాణం తప్పలేదు. మైళ్ళు నడిచి దట్టమైన అడవిలో చంద్రపూల్ నుంచి వచ్చిన కొంతమంది మహార్లతో కలిసి సాగుచేసుకోవడం మొదలు పెట్టాడు జంగూ! అటవీప్రాంతాన్నే ఆక్రమించి వ్యవసాయం చేసుకొంటున్నావంటూ మామూళ్ళు దండుకునే అధికారులు జంగూను పీడించుకుని తిన్నారు. ఫారెస్టుగార్డులు, రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ల జులుంతో ఇరవైఏళ్ళు గడిచిపోయాయి. అకస్మాత్తుగా ఒకరోజు డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసరొచ్చాడు. 'నువ్వు దున్నుతున్న పొలం రిజర్వు ఫారెస్టు పరిధిలోకి వచ్చింది. ఖాళీ చేయాల్సిందే' అంటూ హుకుం జారీ చేశాడు.

జంగుతో పాటు సాగుచేసుకొంటున్న వాళ్ళు గిరిజనులు కాకపోయినా సాగుచేసుకుంటూనే వున్నారు. అదేమని అడిగితే 'వాళ్ళపరిధి వేరే' అంటూ అధికారుల సమాధానం. కాళ్ళా వేళ్లా పడితే.. సెక్షన్ 38ఇ కింద జంగూకు టెనెన్సీ చట్టం కింద పట్టా ఇచ్చాం పొమ్మన్నారు. కానీ కాగితం చేతికి రాలేదు. ఆ భూమికి ఎప్పుడో 'ఇజారాదర్' నుంచి కొనుక్కున్నానని చెప్పుకుంటున్న ఒక మరాఠీ వ్యాపారి దాని హక్కులకోసం రెవెన్యూకోర్టు నుంచి సుప్రీంకోర్టు దాకా వెళ్ళాడు. అప్పుడప్పుడూ జంగూకు కోర్టు నోటీసు కాగితాలు అందుతూవుంటాయి. తన తండ్రిలానే జంగూకు దానిలో వున్న విషయం తెలియదు.

జంగూ ఇంకా బ్రతికే వున్నాడు. జీవచ్ఛవంలా... జంగూకు ఇల్లులేదు..భూమిలేదు...వున్నదల్లా ఆకలి.

జంగూ నడుస్తున్నాడు...ఏవైపు...తుపాకీల వైపా? జంగూ ఆలోచిస్తున్నాడు.

**ఒకవేళ భూసంస్కరణల చట్టాల గురించి విన్నా చదివి అర్ధం చేసుకోగలిగినా.. వాటి ప్రయోజనాలు మాత్రం జంగూ వంటి వాళ్ళకు దక్కవు వీటికి కారణాలు ఆలోచించి, అన్వేషించే వాళ్ళెవరు?**





# రైతాంగానికి సహాయం... పెరిగిన రుణ సదుపాయం



మన రాష్ట్రంలోని గ్రామీణ, వ్యవసాయ రంగాలు నిలకడగా అభివృద్ధిని సాధించాలంటే సమర్థమైన పరపతి విధానం చాలా అవసరం. ప్రస్తుత సరళీకృత ఆర్థిక విధానాలు మన గ్రామీణ పరపతి సంస్థలను తీవ్రంగా ప్రభావితం చేస్తున్నాయి. అందువల్ల వీటికి అనుగుణంగా మన విధానంలో మార్పులు తీసుకొని రావాలి. వ్యవసాయ రంగంలోని ఉత్పత్తికీ, పెట్టుబడులకూ, వెన్నుదన్నుగా నిలిచే పరపతి విధానాన్ని రూపొందించుకుని, గ్రామీణ పరపతి సంస్థలను బలోపేతం చేయాలి.

## పెరిగిన రుణ సహాయం

రాష్ట్రంలో చిన్నతరహా, మధ్యతరహా రైతులు వ్యవసాయ రుణాల అవసరాలు ఇంకా తీరాల్సి ఉన్నా ఈ తరుణంలో రాష్ట్ర ప్రభుత్వం అనేక చర్యలు చేపట్టింది. 2003-2004 ఆర్థిక సంవత్సరంతో సరిపోల్చి చూస్తే 2004-2005 సంవత్సరానికి గాను పంట రుణాలను 41.78 శాతానికి, కాలావధి రుణాల్లో 147.41 శాతానికి పెంచింది. ఈ ఏడాది ఖరీఫ్ కాలానికి కేటాయించిన 7,500 కోట్ల రూపాయలలోని ఆగస్టు 25 నాటికి 5,066 కోట్ల రూపాయలను పంపిణీ చేసింది. గత సంవత్సరంతో సరిపోల్చి చూస్తే ఇది 1161 కోట్ల రూపాయలు ఎక్కువ.

## ప్రభుత్వం చేపట్టిన చర్యలు

మన రాష్ట్రంలోని గరిష్ఠ సంఖ్యలోని,రైతులను రుణ సహాయం అందేందుకు రాష్ట్ర ప్రభుత్వం సత్వర ఆదేశాలు జారీచేసింది. అవి సక్రమంగా అమలు జరిగేందుకు వ్యవసాయ శాఖలోని యంత్రాంగం చురుగ్గా వ్యవహరిస్తోంది.

- పట్టాదారు పాసుపుస్తకాలు లేవన్న కారణంతో రుణాలు పొందలేకపోతున్న రైతులకు ప్రత్యామ్నాయ ఏర్పాట్ల ద్వారా సహాయం అందించాలని జిల్లా కలెక్టర్లకు ఆదేశాలు జారీ అయ్యాయి.
- ఈ విషయమై రాష్ట్ర వ్యవసాయ శాఖ, బ్యాంకులు విస్తృత ప్రచారాన్ని నిర్వహిస్తున్నాయి.
- ఇంతవరకు గ్రామీణ పరపతికి నోచుకోని రైతుల జాబితాను రూపొందించాలని, ఆ జాబితాలోని రైతులకు గ్రామీణ పరపతి సంస్థల ద్వారా రుణాలు అందేలా చూడాలని జిల్లా కలెక్టర్ల పర్యవేక్షణలో ప్రభుత్వ యంత్రాంగం పెద్దఎత్తున కృషి చేస్తోంది. ఇప్పటివరకు 13.56 లక్షల రైతులు ఆ జాబితాలో చోటు చేసుకున్నారు. ఒక్కో బ్యాంకూ ఇప్పుడు ఉన్న సంఖ్యకు అదనంగా నూరుగురు రైతులకు రుణలివ్వాలని ప్రతిపాదనలు వెళ్లాయి. ఈ ఏడాది కనీసం 4.90 లక్షల మంది అదనపు రైతులకు 1345 కోట్ల రూపాయల రుణాలు బ్యాంకుల ద్వారా అందజేయబడతాయి.
- నాబార్డ్ రూపొందించిన మార్గదర్శక సూత్రాల సహాయంతో విశాఖపట్నం, గుంటూరు, అనంతపురం, కడప, నిజామాబాద్, మహబూబ్‌నగర్ జిల్లాల్లోని 6000 రైతు మిత్రా గ్రూపులను రుణ సహాయం కోసం గుర్తించడం జరిగింది. వివిధ బ్యాంకులు, వాటి శాఖలు చిన్నతరహా, మధ్యతరహా రైతులకు రుణాలను పంపిణీ చేస్తున్నాయి.
- అన్ని రకాల పంటలకూ పూర్తిస్థాయి పరపతి లభించేలా జిల్లా కలెక్టర్లు, జేడీయేలు, బ్యాంకు అధికారులు కృషి చేస్తున్నారు.

## కరువు బారినపడ్డ రైతులకు బకాయిలపై ఊరట

- ఇంతవరకు రైతులు బకాయిపడ్డ అసలు, వడ్డీలను 2004 మార్చి 31 నాటి అసలు మొత్తంతో కలిపి, దీన్ని ప్రస్తుతం అమలులో ఉన్న వడ్డీ రేట్లలో అయిదు సాంవత్సరిక వాయిదాల్లో రైతులు చెల్లించేందుకు ప్రభుత్వం వీలు కల్పించింది.
- గతంలో బకాయిలు ఉన్న రైతులకు కొత్త రుణాలు అందేలా నాబార్డ్ మార్గదర్శక సూత్రాలను వెలువరించింది.
- క్షామపీడిత బడుగు రైతులకు తోడ్పడేందుకు సల్పకాలిక రుణాలతో అసలు మొత్తాన్ని మధ్యకాలిక రుణాలుగా మార్చడం జరిగింది. చిన్న, మధ్యతరహా రైతులు తమ స్వల్పకాలిక రుణాలపై చెల్లించాల్సిన వడ్డీలను ప్రస్తుతానికి వాయిదావేసి, రాబోయే పంట కాలంలో చెల్లించేలా ఏర్పాట్లు చేయడం జరిగింది. వీటికి చక్రవడ్డీ వర్తించకపోవడం గమనించాల్సిన విషయం.
- పరపతిని అవసరాలకు అనుగుణంగా పొందేందుకు వీలుగా బ్యాంకులు కిసాన్ క్రెడిట్ కార్డులను రైతులకు అందజేస్తున్నాయి. ప్రస్తుతం 56.6 లక్షల మందికే ఇవి అందుబాటులో ఉన్నాయి. ఇంకా 43.4 లక్షల మంది రైతులకు వీటిని అందించేందుకు బ్యాంకులు కృషి చేస్తున్నాయి.
- 5.85 లక్షల రైతులు చెల్లించాల్సిన 1417 కోట్ల రూపాయల పంట రుణాలను మధ్యకాలిక రుణాలుగా మార్చడం జరిగింది.

జారీచేయువారు : సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్.

*Owned, Printed and Published by V.Hanumantha Rao at D.No.8-3-898/22, Road No.3, Nagarjuna Nagar, Hyderabad-5000 073 Ph: 23748672, DTP at Samata Graphics, Hyderabad. Printed at Akruti, Chikkadapalli, Hyderabad. Editor: V.Hanumantha Rao*